Photo by Pranlal K. Patel



బహుమతి
పొందిన వ్యాఖ్య

పిల్లవాని ప్రేమధనము

పంపినవారు:
జె. సత్యనారాయణప్రసాద్

## ఈ సంచికలో యివి చదువుకోండి





ఇవన్నీగాక బదులుచెప్పు ఫోటోవ్యాఖ్యల పోటీ
ఆకర్షవంతమైన మరికొన్ని క్రొత్తశీర్షికలు వున్నై.

మా ఖాతాదార్లకు, మా శ్రేయోభిలాషులకు "ఉగాది" అభివందనములు

## "ఉమా" నగలు




కలయిక లోహము పైన బంగారపు రేకు అతికించి తయారు చేయబడిన పగుట చేత అనేక సంవత్సరములు మన్నికగా యుండి తృప్తి పరచుచున్నవి.

వి. పి. పార్శిలు చార్జి రు. 1-2-0. క్యాటలాగు కోరినవారికి ఉచితముగా పంపబడును.

**ఉమా గోల్డు కవరింగు వర్క్సు, ఉమా మహల్, మచిలీపట్నం.**

టెలిఫోను : నెం. 120 :: తంతివిలాసము : "ఉమా"

## జాస్తిగా తృప్తి నొసగేవి



కే. సి. పి. వారి

**కృష్ణ**

పిప్పరమెంట్లు

ది కే. సి. పి. లిమిటెడ్,
వుయ్యూరు, కృష్ణా జిల్లా..

SISTA'S KC-4-TEL

# ఆంధ్ర ఇన్సూరెన్సు కంపెని, లిమిటెడ్.

ప్రధాన కార్యాలయం—మచిలీపట్నం

27 సంవత్సరములు అకుంఠిత దీక్షతో సేవజేయుచూ ముందడుగు వేయుచున్న భీమాసంస్థ

బోనస్సు సాలుకు 1000 కి రు. 9 లు.

1953 మా వ్యాల్యుయేషను సంవత్సరము

| | | |
|---|---|---|
| అమలులోవున్న, భీమా మొత్తము | .... | రు. 10 కోట్లకు మించినవి |
| మొత్తపు ఆస్థులు .... | .... | రు. 2 కోట్లకు మించినవి |
| సాలీనా ఆదాయము మొత్తము | .... | రు. 60 కోట్లకు మించినవి |

ప్రాణభీమాతోబాటు

అగ్ని, ప్రమాదము, మోటారు, నౌక, మొదలైన ఇతర భీమా వ్యాపారము గూడ జయప్రదముగా నిర్వహింపబడుచున్నది.

మా ఆఫీసులు:

మద్రాసు, బొంబాయి, కలకత్తా, నాగపూర్, బెంగుళూర్, బెల్గాం, అనంతపూర్, సికింద్రాబాద్, వరంగల్, బర్హంపూర్, ఎర్నాకులం, బెజవాడ, రాజమండ్రి, గుంటూరు, జెంషెడ్పూర్, విశాఖపట్నం, మంగళూరు, డిబ్రుగర్, (అస్సాం) పాట్నా, అలహాబాద్, అహమ్మదాబాద్. ఢిల్లి, వగైరా.

# మధుర మందహాసములు





మీ బిడ్డకు ప్రియమైన

లాజెన్జులు, పెప్పర్మెంట్లు, టాఫీలు, చాక్లెట్లు



**M. A. P. INDUSTRIES**

TONDIARPET : MADRAS-21



# చందమామ

సంచాలకుడు:
'చక్రపాణి'

గడచిన ఆరునెలలనుంచీ మీరు చదువుతూవచ్చిన సీరియల్‌కథ 'రత్నకిరీటం' ఈ సంచికతో ముగిసిపోయింది. ఈ కథ మీ హృదయాలలో ఎటువంటి భావాలను కలిగించిందీ తెలుసుకోవటానికి కుతూహల పడుతున్నాము. కిందటి నెలలో ప్రారంభించిన 'జాతక కథలు'కూడా మీకు యెలా నచ్చినవి తెలుసుకోవాలని మా అభిలాష. మీ అభిప్రాయాలను వివరంగా వ్రాసి, 'కథల తాతయ్యకు: చందమామ ఆఫీసు, మదరాసు-26' అనే చిరునామాకు వెంటనే పంపించండి. తరువాత— మళ్ళీ వచ్చే సంచికనుండే, 'శబ్దవేధి' అనే మరిఒక చక్కటి సీరియల్ ప్రారంభం కాబోతున్నదని తెల్పటానికి ఆనందిస్తూ వున్నాము. కొత్త సంవత్సరమైన ఈ 'విజయ'లో కొత్త సీరియలే గాక, మరికొన్ని కొత్త శీర్షికలుకూడా ప్రారంభించబోతున్నాము. ఈ విజయ సంవత్సరం మనందరకూ సమస్తమయిన విజయాలనూ చేకూరుస్తుందని ఆశించుదాం.

సంపుటి 12 :: ఏప్రిల్ 1953 :: సంచిక 4

SANKAR...




# మంచిశాస్తి

అనగనగా ఒక అమ్మాయి.
మంచిదేను ఆ అమ్మాయి.
కాని ఒక్క దుర్గుణముంది.
ఒల్లనిపని చేస్తుంటుంది.

బల్లల సొరుగులు తీస్తుంది
కాగితాలు తిరగేస్తుంది
కలికి అన్నిటిని చూస్తుంది.
చిందరగా పారేస్తుంది.

ఇందువల్ల ఆ అమ్మాయి
అందరి నోటా పడిపోయి
వేషాలెన్నో పోయింది.
మంచిపేరు కోల్పోయింది.

ఒకనా డింటెవరూ లేరు.
అంతా ఎటకో వెళ్ళారు.
అమ్మాయొక్కత్తే ఉంది.
మంచి సమయమని అనుకుంది.

మదిని సంతసం హెచ్చింది.
తాతగారి గది జొచ్చింది.
బల్లమీద కనబడ్డాయి
సులోచనాలు, పొడుంకాయ.



'బలే, బలే!' అని అనుకొంది.
జోడుపెట్టుకొని కులికింది.
ఇంతట్లోన పొడుంకాయ
చూచిం దింకేం, అమ్మాయి.

జోడు బల్లపై పెట్టింది.
పొడుంకాయ చేపట్టింది.
మూత ఎంతటికి రాలేదు.
తలచిన పని పడికాలేదు.

అప్పుడు అమ్మా యనుకొంది :
'మూత ఎంతటికి రాకుంది.
గోరుపెట్టి లేపేస్తాను
ఎందుకు రాదో చూస్తాను ?'






రచన :
బైరాగి

అని గోటను లేపేసింది.
మూత విడిం దింకేముంది ?
పొడుం మొగంపై చిమ్మింది.
లోకం చీకటి క్రమ్మింది.

క్రింద పడింది పొడుంకాయ.
బాపురన్నదా అమ్మాయి.
అంతట తాతయ్యొచ్చాడు.
లెంపకాయులే ఇచ్చాడు.

# అట్టివిహాదిబొమ్మ

ద్రోణాచార్యులవద్ద కురుపాండవులందరూ సమస్తమైన విద్యలూ అభ్యసించారని చెప్పిఉన్నాముకదా! వారికి విద్యలు పూర్తి అయినై. ఒక మంచిరోజున వారందరకూ గురువు విద్యాపరీక్షలు పెట్టించాడు.

ఆ రోజున, రాజపరివారమే గాక, రాజ్యంలోని పౌరులూ, పసిబిడ్డలుసైతం వేడుకలు చూడవచ్చారు. కత్తిసాములు, గుర్రపుస్వారీలు, మల్లయుద్ధాలు మొదలైనవన్నీ అద్భుతంగా జరిగినై. అందరూ ఆశ్చర్యపోయారు. మల్లయుద్ధంలో భీముడికీ దుర్యోధనుడికీ పోటీపడింది. వారుభయులూ అసహాయశూరులని అనిపించుకున్నారు. వారిని వారించటానికి భీష్మద్రోణాదులవంటి పెద్దలు చాలా శ్రమపడవలసివచ్చింది. అంత పౌరుషంగా నడిచింది, వారి పోటీ!

అటు తరువాత-శస్త్రవిద్యాప్రదర్శనం. విలువిద్యలో అర్జునుణ్ణి మించినవారు ఎవ్వరూ లేరని ఏకకంఠంతో అందరూ జయఘోష పెట్టారు. ఈ మాట వినగానే కర్ణుడు ముందుకువచ్చి, "కుర్రకుంక, అర్జునుడికేమి వచ్చు విలువిద్య? ఏమీ తెలియకుండా ఎందుకు వాడిని ఊరక పొగడుతున్నారు? చూడండి నావిద్య" అంటూ, తన శస్త్రవిద్యానైపుణి అగపరిచాడు. "భేష్! భేష్!!" అని పలువిధాల మెచ్చుకున్నారు అందరూ.

ఈ విజయగర్వం చూచుకొని కర్ణుడు "అర్జునా!—నాతో యుద్ధంచేసి నన్నుగెలువు"మని సవాలుచేశాడు. ప్రశాంతభావంతో అర్జునుడు 'ఏమిటి అనుజ్ఞ?' అన్నట్టు భీష్మ, ద్రోణులవంక చూచాడు. అప్పుడు వారు లేచి, "ఇది పరీక్షారంగమేకాని యుద్ధరంగం కాదు" అని అంటూ, "అయినా, కర్ణా!—సూత పుత్రుడవైన నీవు రాజకుమారుడైన సారథిని యుద్ధానికి పిలవటం తగదుసుమా" అని మందలించారు.

అప్పుడు దుర్యోధనుడు లేచి, సభవంక తిరిగి "అదేం మాట? ఇప్పుడే నేను కర్ణుణ్ణి అంగరాజ్యానికి ప్రభువుగా చేస్తున్నా"నని చెప్పి, వెంటనే మంగళ ద్రవ్యాలు తెప్పించి, కర్ణుడికి పట్టాభిషేకం జరిపించాడు.



# స్వర్ణ పాత్ర

పూర్వం ఒకప్పుడు 'శేరీ' రాజ్యంలో బోధి సత్వుడు పాత్రసామానుల వ్యాపారస్థునిగా జన్మించాడు. అతడు పాతపాత్రలు కొనేవాడు, కొత్తపాత్రలు అమ్మేవాడు. ఈ వ్యాపారంలో బోధిసత్వుడు దురాశకు పోక, న్యాయసమ్మతంగా బేరం సాగిస్తుండేవాడు.

ఆ రాజ్యంలోనే, ఇదే వ్యాపారం సాగించే పిసినారి వర్తకుడు ఒకడు ఉండేవాడు. అతడు ఎప్పుడూ బోధిసత్వునితో పోటీ పడుతూ ఉండేవాడు. చాలా దురాశాపరుడు. డబ్బుకూ, వానిప్రాణానికీ లంకె. ధనాశవల్ల ఎంతటి దుష్కృత్యానికైనా వెనుతీసేవాడు కాడు. పైగా, బోధిసత్వుడు ఎక్కడకు వెళ్ళినా, తప్పక వెంబడించేవాడు.

ఒకప్పుడు ఇద్దరూ కలిసి 'తేలవాహ' నదిని దాటుకొని, 'అంధాపురం' ప్రవేశించటం జరిగింది. పట్టణంలో ప్రవేశించగానే ఇద్దరిమధ్యనీ అనవసరమైన పోటీలేకుండా కొన్ని వీథులు అతనూ, కొన్ని వీథులు ఇతనూ పంపకం వేసుకొన్నారు.

అంధాపురంలో ఒక కుటుంబం ఉంటున్నది. ఆ కుటుంబం బొత్తుగా చితికి పోయింది. ఐతే, పూర్వకాలమందు ఈ కుటుంబంవారు గొప్ప వ్యాపారస్థులు. కాని యిప్పుడు, వాళ్లకు అంగబలమూ అర్థబలమూ కూడా లేకుండాపోయింది.

పోతే, ఆ కుటుంబంలోకల్లా మిగిలివున్న వాళ్లు ఒక అవ్వా, ఆమె మనమరాలున్ను. వీళ్ళిద్దరూ పాపం, ఊళ్లో ఆపనీ ఈపనీ చేసి పొట్టపోసుకొంటూ కాలక్షేపం చేసేవాళ్లు.

ఈ దరిద్రులు, ఇంట్లో వుండే సరకూ సప్పరా అన్నీ అమ్మేసి కాలం గడుపుకొన్నారు. ఐతే, అన్నీ అమ్మేసినప్పటికీ, ఒక్క వస్తువుమాత్రం వాళ్లదగ్గర ఇంకా మిగిలి

హెచ్. ఆదినారాయణ



వున్నది. అది, ఆ యింటి యజమాని ఐన గొప్ప వర్తకుడు భోజనంచేసేటటువంటి కంచం. అది ఏనాటినుంచో సామానులలో పడి, నలిగి, దుమ్ము పట్టిపోయింది. అందుచేత, అది ఏమికంచం అయివుంటుందో అవ్వకూ తెలియదు, పిల్లకూ తెలియదు.

ఇలా ఉండగా—రెండవవాడైన పిసినారి వర్తకుడు 'పాత్రలమ్మా పాత్రలూ!–పాతవి కొంటాం, కొత్తవి అమ్ముతాం' అని కేకలేసుకుంటూ, అదేవీథిలో అవ్వ ఇంటికి వచ్చాడు.

కేక వినబడటంతోనే పిల్ల అవ్వదగ్గిరకు పరుగెత్తిపోయి 'నాకొక లోటా కొనిపెట్టవే మామ్మా, మంచినీళ్ళు తాగటానికి?' అని జాలిగా అడిగింది.

'ఏంపెట్టి కొనమంటావు తల్లీ?' అన్నది అవ్వ విచారంతో.

అప్పుడు మూలబడిన ఆ కంచం సంగతి జ్ఞాపకంచేసింది పిల్ల. అది ఆ వర్తకుడికిచ్చి, ఏదన్నా లోటా యిమ్మంది అవ్వ.

వర్తకుడు ఆ కంచం చేతపట్టిచూచాడు. బంగారపుది ఐవుంటుందనితోచగానేసూదితో గీటుపెట్టి చూచాడు. అది ఒకటవరకం మేలిమి బంగారమని తేలింది. ఒక్క పైసాఐనా యివ్వకుండా ఆ కంచం కాజేదామని వాడికి దుర్బుద్ధి పుట్టింది.

పుట్టి, 'ఇదెక్కడ దొరికిందమ్మా నీకూ? గుడ్డిగవ్వకూడా చెయ్యదు. పొద్దుటే లేచి ఎవళ్ళమొహం చూచానో, మంచిబేరమే!' అని విసుక్కొంటూ, ఆ కంచం కిందకు విసిరేసి, గభీమని లేచి వెళ్ళిపోయాడు.

వాడు వెళ్ళిపోగానే, మరొక దిక్కునించి బోధిసత్త్వుడు వచ్చాడు ఆ వీధికి—అలానే కేకలేసుకొంటూ. ఈకేక వినగానే, పిల్ల మళ్ళీ అవ్వదగ్గరకు పరుగెత్తిపోయింది.

అందుకామె 'ఎందుకే తల్లీ ఈ తాపత్రయం? ఇప్పుడేకదా ఆ అబ్బి వచ్చి, ఆ

కంచం పనికిరాదని విసిరికొట్టిపోయాడు ?'
అన్నది, బిడ్డను సముదాయిస్తూ.

'అలాకాదు మామ్మా. ఈ అబ్బి చాలా మంచివాడల్లే వున్నాడు. దయగా మాటాడుతున్నాడు. మన కంచం వీడు తప్పకుండా పుచ్చుకుంటాడు' అని నమ్మబలికింది పిల్ల.

సరే కానిమ్మని, ఆ అబ్బిని ఇంట్లోకి పిలిచారు. కంచం చేతికిచ్చారు. అది చూస్తూనే నిజం గ్రహించి, బోధిసత్వుడు 'అమ్మా! ఈ కంచం బంగారపుది. ఒక వెయ్యి మొహిరీలు ఖరీదుచేస్తుంది. మరి, పుచ్చుకుందామంటే నాదగ్గిర యిప్పుడున్న సొమ్ము చాలదు' అని చెప్పాడు.

అప్పుడు అవ్వ 'అయ్యో నాయనా!— ఇప్పుడు, నువు వచ్చేముందే ఒక వర్తకుడు వచ్చి చూచాడు. గుడ్డిగవ్వకూడా చెయ్యదని చెప్పి విసుక్కుని, విసిరికొట్టాడు. ఇది బంగారపు కంచమని అంటున్నావే. నీ మంచితనంవల్లనూ మహిమవల్లనే యిలా మారిపోయిందేమో, నాయనా!–నీకేంతోస్తే అది ఇచ్చిపో' అన్నది.

అప్పుడు బోధిసత్వునివద్ద ఐదువందల మొహిరీలుమాత్రమే వున్నవి. కొంత పాత్ర సామగ్రి వున్నది. ఆ మొహిరీలూ, పాత్ర




సామగ్రీ అంతా వాళ్లకు ఇస్తూ, "అమ్మా!– ఈ ధనమూ, సామగ్రీ తీసుకోండి. నేను వర్తకం సాగించటానికిగాను నా దగ్గర సంచీ, త్రాసూ, దారిబత్తెంకోసం ఒక్క ఎనిమిది మొహిరీలూమట్టుకు వుంచుకొంటాను" అని చెప్పాడు.

ఈవిధంగా వాళ్ళ అనుమతి తీసుకున్న బోధిసత్వుడు గబగబ నదివద్దకు పోయి, పడవ నడిపేవానికి రెండు మొహిరీలిచ్చి, పడవ యెక్కాడు.

తరువాత—బోధిసత్వుడు వెళ్ళగానే మళ్లీ పిసినారివర్తకుడు ఆ పేదల యింటికి

వచ్చి, 'ఏదమ్మా, పోనీ ఇలా పట్టుకరా, ఆ కంచం చూస్తాం!' అన్నాడు, ఒక విధమైన నిర్లక్ష్యభావంతో.

వెంటనే అవ్వ ఉరకలేసుకొంటూ యివతలికి వచ్చి, 'నాయనా!—మంచివాడివే నువ్వు. వెయ్యి మొహిరీలు చేసే బంగారు పళ్ళెం గుడ్డిగవ్వకూడా చెయ్యదంటివే. మీ యజమానే కాబోలు, యిప్పుడే వచ్చి వెయ్యి మొహిరీలూ యిచ్చి కంచం పట్టుకపోయాడు,' అని చెప్పింది.

ఈమాట వింటూనే పిసినారివర్తకుడికి నడుము విరిగినట్టయింది. 'అబ్బ! వీడి దుంపతెగా! పదివేలుచేసే బంగారు పళ్ళెం కాజేశాడే దుర్మార్గుడు. నాకెంత నష్టం చేశాడూ? నాకొంప తీశాడే!' అనుకొని, ఎంతగానో విచారించాడు.

విచారించటమేమిటి?–వాడికి మనస్సు వికలమై వెర్రెత్తిపోయింది! తన ధనమూ పాత్రసామగ్రీ అంతా తీసి, ఆ ఇంటిముందు విసిరేశాడు. ఒకకర్ర చేతపట్టుకుని గబగబ నదిఒడ్డుకి చేరుకున్నాడు.

అప్పటికప్పుడే బోధిసత్త్వుడు చాలావరకు నది దాటేశాడు. 'వాడిని దాటించబోకు. పడవ వెనక్కు మళ్ళించు' అంటూ పిచ్చి పిచ్చిగా కేకలుపెట్టసాగాడు ఆ పిసినారి. అలా చేయవద్దని పడవవానితో చెప్పాడు బోధిసత్త్వుడు.

చేసేది లేక, పిసినారి బోధిసత్త్వునికేసి చూస్తూ, తిడుతూ, తీరనిదుఃఖంలో మునిగిపోయాడు. నెత్తురు వేడెక్కిపోయింది. ఒడలు కంది, ఎర్రబారింది. గుండె కొట్టుకోసాగింది. బోధిసత్త్వుడిమీది ఆగ్రహమూ, ద్వేషమూ పట్టలేక వాడు వెంటనే నదిలోకి దూకేశాడు!

బోధిసత్త్వుడుమాత్రం తరువాతకూడా లోకంలో ఎన్నో దానాలు ధర్మాలూ చేస్తూ, దయకలిగి ప్రవర్తిస్తూ ధర్మపరుడని మంచి పేరు తెచ్చుకొన్నాడు.






## 6

"అంతలో— మహీపాలుడు సరీగా అనుకొన్నట్టుగానే, పారుగుద్వీపపు రాజు వసుపాలుడు, మంజులద్వీపంమీదికి దండెత్తివచ్చాడు. ఉభయపక్షాల మధ్యనీ తీవ్రమైన యుద్ధంజరిగింది. ఆ యుద్ధంలో తపోవర్ధనుడూ మహీపాలుడూకూడా మరణించారు! ఈ వార్త వినగానే మహీపాలుని భార్యకూడా ప్రాణంవిడిచింది!!

అటుతరువాత వసుపాలుడు మంజుల ద్వీపాన్ని ఆక్రమించుకొని, రత్నకిరీటం కోసం అంతటా వెతికాడు. కనిపించలేదు. వెంటనే భటులను నలుమూలలకూ పంపి వెతికించాడు. ఫలితం లేకపోయింది.

ఇలా ఉండగా-ఒకరోజున రాజు వేటకు వెళ్ళినప్పుడు ఆ అడవులలో చెట్టుపైన కొమ్మలసందున, ధగధగ మెరిసే రత్నకిరీటం చూడటం తటస్థించింది. కాని, యేమీ చేయలేకపోయాడు. ఏమంటే—

ఆ చెట్టు మొదలును ఒకానొక భయంకర భూతసర్పం చుట్టుకొనివున్నది. ఆ సర్పానికి కన్నులు మినుకుమినుకుమంటున్నవి. కాళ్లకు పంజాలూ పులిగోళ్ళూ అమరివున్నాయి. చర్మమంతటా బలిష్ఠమైన డిప్పలున్నవి. మొసలిలాగా కనిపిస్తున్నది. అది నోరుతెరచి బుసలుకొడితే, అగ్నిజ్వాలలు ఎగసివస్తున్నయి !!

వసుపాలుడు కోటకు మరలిపోయాడు. 'ఫలానాచోటున రత్నకిరీటమున్నది. ఎలా అయినా దానిని తీసుకరండి' అని భటులకు అజ్ఞాపించాడు. భటులందరూ




పోయి, ప్రయత్నించి, విఫలులయ్యారు. అప్పుడు, రాజు 'ఆ భూత సర్పాన్ని చంపి, ఎవరైతే రత్నకిరీటాన్ని తెస్తారో, వాళ్ళకు కోరుకొన్న బహుమతి యిస్తా'మని దండోరా వేయించాడు. ఈ చాటింపు విన్న ప్రతివాళ్లకూ ఆశ కలిగింది. కాని, వెళ్ళి యత్నించినవాళ్ళందరూ భూతసర్పం వెలి గ్రక్కే మంటలకు ఆహుతి ఐపోసాగారు!

చివరకు రాజు విసుగుచెందాడు. పేరు పొందిన జ్యోతిష్కులను రప్పించి, 'కిరీటం పొందేమార్గం ఏమిటి?' అని ప్రశ్నించాడు.

వాళ్ళు చక్రాలువేసి, అంకెలు గుణించి 'మహారాజా!— ఏనాటికైనా రత్నకిరీటం వారి వంశస్థులకే చిక్కుతుందిగాని, ఇత రులు యత్నించి లాభమే లేదు' అని చెప్పారు. ఎవరైనా వస్తారేమో అని వసు పాలుడు అలానే కనిపెట్టుకొని వున్నాడు. ఆ మహీపాలుడే మీ పెద్దనాయన, అతనే ఆత్మకు శాంతి కలిగించమని కలలో బతి మాలుత" అని చెప్పాడు మిత్రానందుడు.

తరువాత మళ్ళీ—"కుమారా, చిత్ర భానూ!—ఆ రత్నకిరీటం సంపాదించి తీసుకరావటంతో మీ పెదనాయనకు ఆత్మ శాంతీ కలుగుతుంది, కుటుంబ గౌరవమూ నిలబడుతుంది. మీ తాత అమరభూపతి నీకోసం బెంగపెట్టుకుని వున్నాడు. ముందు అక్కడికి పోయి, అతని దీవన పొంది మరీ బయల్దేరు. నీకు మేలవుతుంది" అంటూ హితవు చెప్పాడు.

చిత్రభానుడు మగధరాజ్యానికి బయలు దేరాడు.

*　　*　　*

ఆనాడు మందపాలుడు ప్రమోదుణ్ణి అగ్ని ప్రమాదంనుండి కాపాడి, తరువాత అర్ధ కర్ముని భార్యనుకూడా రక్షించటానికిగాను తిరుగా అతను కారాగారానికి వెళ్ళినట్టు చెప్పివున్నాము కదా?



ఆ సమయంలో ముసలి రాజు ప్రమో దుడు, తనను ఎవ్వరూ గమనించలేని మోస్తరుగా నటిస్తూ, అక్కడినుండి మెల్లగా జారుకోసాగాడు. ఆ సందట్లో ఎవరూ అతనిని గమనించలేదు. రాజ్యంలోని ప్రజలే అతనిని గుర్తుపట్టలేనప్పుడు రాజ గురు నియమించిన భటులా గుర్తించేది?

కారాగృహంనుండి బయటపడిన ప్రమో దుడు అన్నాహారాలు మాని, కాళ్ళు ఎక్క డకు తీసుకపోతే అక్కడికి పోసాగాడు.

ఒకచోట అమరభూపతి చారులు తారస పడి, ప్రమోదుణ్ణి గుర్తుపట్టి, తమ ప్రభువు వద్దకు తీసుకపోయారు. వియ్యంకుడు కంటబడటంతో అమరభూపతి పరమా నందం పొందాడు.

అంతలో చిత్రభానుడు మగధ చేరు కొన్నాడు. పిన్నవానిని చూస్తూనే తాత లిద్దరూ పొందిన ఆనందానికి మేరలేక పోయింది. పసివాడు తలపెట్టిన మహత్కా ర్యానికి ఎంతగానో మెచ్చుకొని వారు మరీ సంతోషించారు.

ఐతే, బిడ్డడు ఒక్కడూ పోవడం తాతలకు మనస్కరించిందికాదు. అప్పుడు అమర భూపతి తన కుమారుడు విజయభూపతిని




తోడిచ్చి, ఇద్దరినీ దీవించి, మంచిరోజున మంజులద్వీపానికి ప్రయాణంకట్టాడు.

* * *

అక్కడ, కారాగృహంవద్ద—ఏమి జరిగిం దంటే—

సోలిపోయిన రాజగురు తేరుకొన్నాడు. ఐతే, ప్రమాదం ఎలా సంభవించిందీ అర్థం కానేలేదు. ఇంత జరిగినా దుష్టచింతలను మానలేదు. తన పాచిక పారలేదుకదా అని విచారించి ముసలిరాజును రక్షించి నందుకు మందపాలునిపైన పగపట్టాడు.

ఇంతకూ ప్రమోదుడు కనబడకపోగా కలవరపడ్డాడు. చివరకు 'పోనీ, ముసలి





వాడు యెక్కడ చస్తే మనకేం!' అని తలిచి, ఉపేక్ష వహించాడు.

ఒకనాటి రాత్రి రాజగురు, మందపాలుడు యేమరివుండగా బాకుతో చంపి, ఆ నేరం నిరపరాధి ఐన ఒక అమాయకుని పైన మోపి, వాడికి ఉరిశిక్ష వేయించాడు.

రాజగురు మాయచేసి ముసలిరాజునూ, మందపాలుణ్ణీ చంపివేసి ఉంటాడని ప్రజలు ఊహించారు. పైగా, కప్పంకోసం రాజగురుచేసే నిర్బంధంతట్టుకోలేక సామంతులు మళ్లీ అమరభూపతిని ఆశ్రయించారు. ఇప్పుడు అమరభూపతికీ వృద్ధరాజయిన ప్రమోదుని సలహాయే!

దూరం యోచించాడు ప్రమోదుడు. ఇప్పుడు భల్లాణకోటను ముట్టడించటమే పని అన్నాడు.

సామంతులందరూ యేకమై రాత్రికి రాత్రి భల్లాణకోటను ముట్టడించారు. అన్ని బలాలూ ఉడిగిపోయిన రాజగురు కలత చెందాడు. రహస్య సొరంగంద్వారా తప్పించుకుపోదామని చూచాడు. రెండడుగులు వేశాడో లేదో, అమరభూపతి సేవకులు పట్టివేశారు. తెల్లబోయాడు రాజగురు! రహస్యద్వారాలకు ప్రమోదుడు కాపలా పెట్టించిన సంగతి వానికేం తెలుసు?

కోట ప్రమోదుడి వశమైంది. సామంతులు సంతోషించారు. ప్రజలు పరమానందం పొందారు. భల్లాణరాజ్యం మరొకసారి పూర్వపు కళతో కలకలలాడింది! అందరూ పసివాళ్లకోసం యెదురుచూడసాగారు.

* * *

చిత్రభానూ విజయభూపతీ కలిసి అష్టకష్టాలూ పడి, చివరకు మంజులద్వీపం చేరుకున్నారు. వసుపాలుడు వాళ్ళిద్దరినీ ఎంతగానో ఆదరించి, గౌరవించాడు. 'మీకోసమే ఎదురుచూస్తున్నా'నన్నాడు.

'ఈనాటికి మళ్ళీ రత్నకిరీటం భల్లాణ రాజ్యం చేరుకోబోతుందంటే నాకు అపరిమితమైన సంతోషంగా ఉన్న'దన్నాడు.

అందరూ అరణ్యం చేరుకొన్నారు. చెట్టుకు చుట్టుకొనివున్న భూతసర్పాన్ని గురించి వసుపాలుడు, చిత్రభానుణ్ణి హెచ్చరించాడు. కిరీటం తేవాలనే ఆత్రంతో చిత్రభానుడు సాహసించి చెట్టువద్దకు వెళ్ళాడు.

భయంతో, ఆశ్చర్యంతో అందరూ చూస్తున్నారు. చ్రరున ఖడ్గం దూశాడు చిత్రభానుడు. సర్పాన్ని ఒక్క వేటు వేయబోయాడు.

చిత్రమేమిటో కాని, ఖడ్గం తగిలీతగలటంతో ఆ భయంకర సర్పం ఒకచక్కటి గంధర్వుడుగా మారిపోయింది!

అప్పు డా గంధర్వుడు, చెట్టుపైనున్న రత్నకిరీటం తెచ్చి, చిత్రభానుని చేతులలో పెట్టాడు.

"నాయనా! నాకు శాపవిముక్తి కలిగించావు—ఇన్నాళ్ళుగా ఇందుకోసమే నేను అందరికీ కలలో కనబడి నా ఆత్మకు శాంతి కలిగించమన్నాను. ఈ పని ఎవళ్ళూ నెరవేర్చలేకపోయారు. ఎప్పటికైనా నీవే ఈ పనికి తగినవాడవనే నమ్మకంతో



ఉంటూవచ్చాను నేను. యుద్ధంలో ప్రాణం పోయినా, ఈ భూతసర్పంగా అకారం తాల్చాను. వంశమర్యాదను నిలబెట్టి, ఆత్మకు శాంతికలిగించిన నీకు కిరీటం వప్పగించివేశాను. ఇక నాకేమీ చింతలేదు" అని చెప్పి, ఆ గంధర్వరూపంలో వున్న మహీపాలుడు అదృశ్యమయ్యాడు.

ఇదంతా చూస్తూవున్న వసుపాలునికి అపరిమితమైన ఆశ్చర్యం కలిగింది. అంతే కాదు, కిరీటాన్ని యెలాఐనా కాజేయాలనే తహతహ ఎక్కువైంది. తన వుద్దేశాన్ని భార్యతో చెప్పాడు. ఆ మాటలు అతని కూతురు జయంతికూడా విన్నది.




ఎట్లాఅయినా వాళ్ళిద్దరినీ కాపాడడానికి నిశ్చయించి, ఆమె తన చెలికత్తె సహాయంతో సగంరాత్రివేళప్పుడు మూడు గుర్రాల్ని కోటవాకిట సిద్ధంచేయించింది. మాటుమణిగిన తరవాత, పసివాళ్లిద్దరూ ఉండే గదిలోకి వెళ్ళి, వెంటరమ్మని వాళ్లను వేగిరపెట్టింది. వాళ్ళు సంశయించటంచూచి, జయంతి-

"నామాట వినండి. నాతండ్రి మిమ్మల్ని చంపేందుకు వస్తున్నాడు. అమ్మతో చెబుతూవుంటే చెవులారా విన్నాను. రత్నకిరీటం కోసమని ఈ ద్వీపంమీద దండెత్తిన మా నాయన, చేతులారా మీకు దానిని వప్పగించి ఊరకుంటాడా? మీరు ఈ కోటలో ప్రవేశించినప్పుడే మేడమీదనుండి నేను మిమ్మల్ని చూశాను. చూచినప్పటినించీ మీకు ఏ అపాయమూ కలగకుండా చేయమని దేవుళ్లకు మొక్కుతు నేవున్నాను. నాతండ్రి ఎంత దురాశాపరుడూకాకుంటే నన్నొక శతవృద్ధుకిచ్చి పెళ్ళిచేయ నిశ్చయిస్తాడా? నాకు తల్లి ఉండీ ఒకటే, లేకా ఒకటే. ఆమెకు మా నాయనకంటే ధనాశ హెచ్చు. అందుకని ఏమన్నా చేస్తుంది. నన్ను ఈ ఆపదనుండి తప్పించండి. తీసుకపోండి. ముగ్గురమూ పారిపోదాం. ఏర్పాట్లు చేసేవచ్చా" అన్నది.

ఆ నడిరాత్రప్పుడే వసుపాలుడు, అనుకొన్నప్రకారం వాళ్లను చంపటానికని బయల్దేరాడు. అంతలో ఒక సేవకుడు పరుగెత్తుకొంటూవచ్చి, 'ప్రభూ!—అమ్మాయిగారు అంతఃపురంలో లేరు. ఈ సంగతి మనవిచేదామని వస్తే యేలిక దర్శనం కాలేదు. అందుకని వెదుక్కొంటూ యిక్కడికి వచ్చాను' అని చెప్పాడు.

ఈ మాట వింటూనే రాజు, తనువచ్చిన పని మరచి, వానితో అంతఃపురానికివెళ్లాడు.

అదేసమయాన- ఆ గదినుండి ముగ్గురూ రత్నకిరీటంతో సహా యివతలకు వచ్చి,

సిద్ధంగా వున్న మూడు గుఱ్ఱాలపైన ఎక్కారు. మేడమీద రాజు వీళ్లను చూచాడు.

వాళ్ల కుట్రను వెంటనే పసికట్టి ఒడిలో కత్తిని చఱ్ఱున విసిరాడు! దురదృష్ట వశాత్తు అది చిత్రభానుని వీపులోపలికి దూసుకపోయింది!! చిత్రభానుడు దానిని గభీమని లాగివేశాడు.

కోటపైనుంచి వసుపాలుడు 'పట్టండి! పట్టండి!!' అని కేకలు వేయసాగాడు. వెంటనే అశ్వికులు బయలుదేరారు. కాని, వాళ్ళను పట్టటం సాధ్యం కాలేదు.




వాళ్ళు, తీరం చేరుకుని, పడవకు లంగరు విప్పి, క్షణంలో సాగిపోయారు! తరుముకువచ్చిన అశ్వికులు చేసేదిలేక, వాళ్లు వెళ్లిపోతూవుంటే నిల్చుని ఓడవైపు చూస్తూవున్నారు.

ఓడలో ఎక్కగానే, జయంతి విజయ భూపతీ కలిసి చిత్రభానుడికి సమస్తమైన ఉపచారాలూ చేశారు. ఎంతచేసినా, విస రిన కత్తి విషపూరితమైనది కావటంచేత, దానిపని అది చేస్తూనేవుంది. అయినా చిత్ర భానుడు ధైర్యం వదలలేదు; తన బాధ పైకి తెలియనీయలేదు.

అక్కడ భల్లాణరాజ్యంలో—

ఓడ దిగిందని వినగానే అశేషజనమూ, ఉప్పొంగిపోయారు. చిత్రభానుడు రత్నకిరీ టాన్ని తాతచేతులలో పెట్టాడు! ప్రమోదుడు చెప్పరాని ఆనందం పొందాడు. పసివాని పట్టాభిషేకానికి వెంటనే యేర్పాట్లు చేయిం చమన్నాడు అమరభూపతితో.

ఐతే - అంతలోనే పసివాడికి ముంచుకు వచ్చింది! వెంటనే రాజు మిత్రానందుని వద్దకు మనిషిని పంపాడు. కాని, యజ్ఞ యాగాదులు ముగించుకొని అతను ఎప్పుడో వెళ్ళిపోయాడు!

చిత్రభానుని పట్టాభిషేక ముహూర్తం సమీపించింది. కాని పసివాడు మంచంమీద

పడుకొనే వున్నాడు. చుట్టూ అందరూ చేరారు. చిత్రభానుడు అందరనూ కడసారి చూశాడు. జయంతిచేతినీ, విజయభూపతి చేతినీ కలిపి, జలజల బాష్పాలు రాలుస్తూ, కను మూశాడు !! అతను అస్తమించటంతో భల్లాణరాజ్యమే దుఃఖసాగరంలో మునిగి పోయింది !!!

వృద్ధరాజు ప్రమోదునికి హృదయంలో చిచ్చుపెట్టినట్టయింది. ఆయన కన్నుల నుండి వలవల రాలే బాష్పధారలకు తెరపి లేకపోయింది.

మరుక్షణంలోనే కన్నులు చింతనిప్పుల లాగా ఎర్రబడినై. ఎక్కడలేని కోపం రత్న కిరీటంమీద వచ్చిపడింది. గబగబ రత్న కిరీటంవుండే గదిలోకి వెళ్ళి, దానిని తీసి, బలంకొద్దీ నేలకువేసి కొట్టాడు. దెబ్బతో కిరీటం ముక్కముక్కలైపోయింది. కాంతులు విరజిమ్మే రత్నాలన్నీ రవ్వలై, మిణుగురు పురుగులలాగా మెరుస్తూ, చెదిరిపోసాగినై.

"నా వంశాన్ని నిర్మూలంచేసిన యీ రత్నకిరీటం ఉండేమి, లేకేమి !—హయ్యో నా చిన్నారి చిత్రభానుడు సింహాసనంమీద కూర్చుండగా, ఈ కిరీటం ధరించివుండగా చూచేభాగ్యం లేకపోయిందికదా ! వాడి పట్టాభిషేకం కలగానినట్టు ఐపోయిందే !! నా ఆశలన్నీ అడుగంటిపోయినయే !!! ఇంకా నేను బతికి ఎందుకు వున్నట్టు ?" అంటూ అనేకవిధాల వాపోయాడు.

మరుక్షణంలో మళ్ళీ ఉగ్రుడయ్యాడు. ఒడలు వణికిపోసాగింది. కాళ్ళు తడబడినై. ఆవేశం పట్టలేక, బట్టలు చింపుకొన్నాడు. జుత్తు పీకుకొన్నాడు. పిచ్చివాని లాగా అటుయిటు అడుగులు వేస్తూ "ఏడీ, నన్నూ నా కుటుంబాన్నీ నాశనంచేసిన ఆ దుర్మార్గుడు ఏడీ ? రాజగురు యేడీ !!—" అంటూ ఉరుములు వురిమాడు.

రాజుకాళ్లు రత్నాల రవ్వలమీద పడగా, జర్రున జారిపోయాడు. మరి లేవలేదు !!!






# జాలి గుండె

స్టైయిన్‌మెట్జు గొప్ప విజ్ఞానవేత్త. ఆయన పరిశోధనచేసి గొప్పగొప్ప విషయాలు ఎన్నో కనిపెట్టేడు.

ఆయన ఉండే దేశంలో చలి యెక్కువ. చలిలోనూ ఇంతా అంతా కాదు; ఎక్కడెక్కడున్న నీరూ తెల్లవారి చూసుకునేసరికి గడ్డగట్టిపోయి ఉంటుంది.

అందుచేతనే ఆయన పరిశోధనలు చేసుకునే గదిలో ఒక పెద్ద గాడిపొయ్యి వంటిది తవ్వించి దానిలో పొద్దుటే నిప్పు రగిల్చి, ఆ మంటదగ్గర కూర్చుని తన పని చూచుకుంటూ ఉండేవాడు.

పొద్దుటే నిప్పు సులభంగా అంటుకోటానికి అనుకూలంగా ఆయన రాత్రి పడుకోబోయే ముందు చిత్తుకాగితాలూ, పాత గుడ్డపేలికలూ అవ్వీ ఆ పొయ్యిలో వేసి సిద్ధంగా ఉంచేవాడు. ఇది అతనికి ఒక అలవాటు. ఒకనాటి ఉదయం అతడు మామూలు ప్రకారం లేచి, పొయ్యిలో నిప్పురాజేద్దామని అగ్గిపెట్టె పుచ్చుకొని వెళ్లాడు. పుల్ల వెలిగించి అంటించటానికని వంగాడు. కాని, ఎందుచేతనో పుల్ల వెలిగిన వెంటనే చెయ్యి వెనక్కి లాగేసుకుని పుల్లకు వెలుగుతున్న మంటను ఉఫ్‌మని ఊదేసి అక్కడనుంచి వెళ్ళిపోయాడు.

ఆవేళ రోజూకన్న చలి యెక్కువగా వుండి వళ్ళంతా పిడచగట్టుకు పోతోంది. చలిదేశాలలో వాళ్ళు కాళ్ళకు ఊలుతో తయారైన మేజోళ్ళూ, చేతివేళ్లకు ఉన్ని తొడుగులూ తొడుక్కుంటారు. ఒంటికి స్వెట్టర్లూ, పైన ముతకగా వుండే కోట్లూ వేసుకుంటారు. చలిబాధ తప్పించుకోగల సాధనాలన్నీ చేస్తారు.

స్టైయిన్‌మెట్జు అవన్నీ వేసుకునే ఉన్నాడు. ఐనా, చలి వణికించేస్తోంది. పెద్ద రగ్గు ఒకటి కప్పుకొని, కాగితంమీద రాసు

పాలంకి వెంకటరామచంద్రమూర్తి




కోపటం ప్రారంభించాడు. చలిమూలాన అతని చేతులు వణుకుతూ అక్షరాలు వంకర టింకరగా వచ్చి, చివరకు అది ఆయన వ్రాత అవునా కాదా అనే సంశయాన్నికూడా కలగజేస్తూవుంది.

ఆ సమయంలో స్నేహితు డొకడు స్టెయిన్‌మెట్జును చూడటానికి వచ్చాడు.

మనదేశంలో ఎవరైనా చుట్టాలుగాని మిత్రులుగాని వస్తే, ముందుగా కాళ్ళు కడుక్కోవటానికి నీళ్ళిచ్చి, ఆ తరవాత మంచినీళ్లు దాహానికివ్వటం మర్యాద.

చలిదేశంలో మర్యాద యేమిటంటే పొయ్యిమంటలో మరొక చెక్కపేడు తగిల్చి ఉష్ణాన్ని యెక్కువచేసి వచ్చిన అతిథిని చలికాచుకోమనడం.

స్టెయినుమెట్జు మిత్రుడికి ఆరోజున ఇలాంటి మర్యాద ఏమీ జరుగలేదు. అతడు పొయ్యికేసి చూసేసరికి అందులో నిప్పు రాజవేసిన చాయలే ఎక్కడా కనపడలేదు.

అతడు ఆశ్చర్యపడి స్టెయినుమెట్జుతో, 'ఏం మహాశయా, నిప్పుమంట లేకుండానే చలిని పోగొట్టగల పరిశోధన యేమైనా చేస్తున్నారా యేమిటి? ఇంకా పొయిలో నిప్పు రాజెయ్యలేదేం?' అన్నాడు చిరునవ్వుతో, వేళాకోళపు ధోరణిలో.

స్టెయినుమెట్జు యేదో చెప్పబోయాడు. కాని, అపరిమితమైన చలిచేత ఆయన గొంతుకకూడా వణుకు పట్టుకుని సరిగా చెప్పలేకపోయాడు.

'నేను నిప్పుచేస్తాను. అగ్గిపెట్టె ఎక్కడ?' అంటూ ఆ మిత్రుడు చనవుతో అనేసరికి, స్టెయినుమెట్జు, 'వద్దు' అంటూ లేచి, మిత్రుణ్ణి పొయ్యివద్దకు తీసుకువెళ్ళి చూపించాడు.

"ఏమిటి?" అంటూ మిత్రుడు పొయ్యిలోకి తొంగిచూడగా, తొలినాటిరాత్రి స్టెయినుమెట్జు అందులో పడేసివుంచిన గుడ్డపేలికల



పైన నవనవలాడుతో కొన్ని ఎలుకపిల్లలు కనపడ్డాయి!

వాటినిచూచి 'పిల్లల్ని పెట్టిందా ఎలుక?' అన్నాడు మిత్రుడు.

'ఔను. రాత్రి ఎప్పుడు పెట్టిందో, పొద్దుట నిప్పురాజేద్దామని వచ్చేసరికి ఇవి కంటికి కనపడ్డాయి' అన్నాడు స్టెయిన్‌మెట్జు.

'ఇంతాచేసి, వీటికోసమేనా మీరు పొయ్యి అంటించటం మానేసి, చలితో బాధపడుతూ వుంట?' అని మళ్ళీ ప్రశ్నించాడు మిత్రుడు.

అందుకు స్టెయిన్‌మెట్జు వాటిని చూస్తో 'పొయ్యి అంటించటం ఎలాగు మరి?' అన్నాడు, ఒకవిధమైన ఆవేదనతో.

'ఈ పిల్లల్ని తీసి మరొకచోట పెట్టి, ఆ తర్వాత పొయ్యి రాజెయ్యవచ్చుగా? వీటి మూలాన మీరు బాధపడటమా?' అంటూ ఆ మిత్రుడు, ఎలుకపిల్లల్ని గుడ్డపేలికలతో సహా ఎత్తబోయాడు.

స్టెయినుమెట్జు మిత్రుడికి అడ్డువచ్చి, 'వాటినిమాత్రం కదపవద్దు! ఆ ఎలుకపిల్లల తల్లి ఎవరో యిక్కడ వెచ్చగా ఉందిగదా అని తగిన జాగా చూసుకుని యీ పిల్లల్ని పెట్టింది. ఇంకా పాపం, కళ్ళు తెరవనైనా లేదు ఈ కూనలు. వీటిని యిప్పుడే స్థానం మార్చి మరొకచోట పెడితే, యివి ఎక్కడున్నదీ ఆ తల్లికి తెలియకపోవచ్చు. ఐనా, ఎందుకూ మనం తొందరపడటం? కొద్ది రోజులు ఓపికపడితే యివి ఇట్టే పెద్దవై, వాటంతట అవే దారిచూసుకు వెళ్లిపోతాయి!' అన్నాడు.

స్టెయినుమెట్జు భూతదయ చూచి అతని మిత్రుడు ఆశ్చర్యపోయాడు.

స్టెయిన్‌మెట్జు, వళ్ళు పిడచకట్టుకుపోయే ఆ చలిలో బాధపడటానికైనా వప్పుకున్నాడుగాని, తన పొయ్యిలో బస చేసిన ఆ యెలుక పిల్లల స్థానం మార్చటానికి మాత్రం అంగీకరించలేదు.

# చీకటిలో మనం చూడలేము - ఎందుచేత?



శబ్దం లేకపోతే నిశ్శబ్దం అంటున్నాము. అలాగే, వెలుతురు లేకపోతే చీకటి అన్న మాట. మనకు వెలుగు ఎక్కడా కనిపించనప్పుడు 'అబ్బ! కన్ను పొడుచుకున్నా కానరాని చీకటి' అంటాము. కాని, ఒక్కొక్కసారి కాంతితరంగాలు వాతావరణంలో పరుగెత్తుతున్నప్పుడుకూడా వాటిని మనం చూడలేకపోతాం.

దీనినిబట్టి ఋజువగుతున్న దేమిటంటే—చూడటానికి ముఖ్యమైన అంశాలు రెండు - ఒకటి: బయట వెలుతురు ఉండాలి. రెండవది: ఆ వెలుగును చూడగల శక్తి మనలో ఉండాలి. చీకటిలో వెలుగు ఉండదు. మనం చూచేది వెలుగుని. అందువల్ల మనం చీకటిలో చూడలేము. కాగా-చూడటానికి కన్నులూ ఉండాలి.

చీకటిగదిలో మేజాబల్ల వున్నదనుకుందాం. కాని, దానిని మనం చూడలేము. ఎందుచేత?—అక్కడ వెలుగు లేక. మేజాబల్ల కనిపిస్తున్నదీ అని అంటే అర్థం, మేజాబల్లమీదినుంచి వచ్చేవెలుగును మనం చూడగలుగుతున్నా మన్నమాట.

అంతేకాదు. గుడ్డివానికి పట్టపగలుకూడా కనిపించదు. అతనికి వెలుగుకూడా చీకటే. దీనివల్ల చీకటి రెండురకాలుగా రావచ్చునని తేలుతున్నది—ఒకటి: వెలుగు లేకపోవటంవల్ల. రెండు: వెలుగును చూచే శక్తి లేకపోవటంవల్లా.

ఐతే పిల్లి, పులి మొదలైన జంతువులు చీకటిలో ఎలా చూడగలుగుతున్నవి? ఈ ప్రశ్నకు సమాధానం తెలుసుకునేముందు, మనం ఒక విషయం గ్రహించాలి. అదేమిటంటే: ఒక్క కాంతికిరణంకూడా లేని కటికచీకటిలో ఎవ్వరూ చూడలేరు. కాని, సాధారణంగా అలా యెప్పుడూ వుండదు. మనం చీకటి వుంది అన్నామంటే దాని అర్థం—'వెలుతురు మనం చూడలేనంత తక్కువగా వున్నది' అన్నమాట.

మన-కన్నులు కొద్దిపాటి వెలుగులో చూడటానికి అనువుగా నిర్మింపబడి వుండలేదు. కాని, కొన్ని జంతువుల కంటిపాపలు చిత్రంగా నిర్మింపబడివుంటాయి. అవి చీకటిలో గల ఏపాటి కొద్దివెలుగునైనా ఉపయోగించుకోగలిగివుంటాయి. అందువల్లనే పిల్లిగాని, పిల్లికన్నులు గల ఇతర జంతువులుగాని నేనూ నీవూ చూడలేనంతటి తక్కువ వెలుతురులోకూడా చక్కగా చూడగలుగుతాయి.




పూర్వం ఆనందనగరాన్ని నిత్యానందుడనే రాజు పాలిస్తూ ఉండేవాడు. అతడికి భాసురాంగి అని ఒక్కగా నొక్క కుమార్తె.

భాసురాంగి నిజంగా పేరుకు తగిన అందకత్తె. జగదేకసుందరి. ఆనాటి రాజపుత్రులలో ప్రతిఒక్కడూ ఆమెను వివాహం చేసుకోవాలని ఉవ్విళ్లూరుతూ ఉండేవాడు.

చివరికి ఇదొక గడ్డుసమస్యగా తేలింది. రాకుమారి వివాహవిషయమై రాజూ మంత్రీ మొదలైన ప్రముఖులంతా తలలు బ్రద్దలు కొట్టుకొనసాగారు.

"నాభర్త కాబోయేవాడు తప్పక జగదేకవీరుడై యుండాలి. మన పొరుగురాజైన వజ్రకాయుణ్ణి మించిన వీరులు లేరుగదా? అతనిని జయించినవాడే నాభర్త ఔతాడు" అన్నది రాకుమార్తె.

ఈవార్త రాజుకు తెలిసింది. రాజు, తన కుమార్తె తెలివితేటలకు అచ్చెరువొందాడు. తనకు సమీపంలో వుండే తిమిరద్వీపాన్ని పాలించే వజ్రకాయుడు మహాక్రూరుడూ, బలశాలీ అన్నది లోకవిదితమే. ఈదెబ్బతో వాడి మరణం, తన కుమార్తె వివాహం ఒక్కసారిగా జరిగిపోగల వనుకున్నాడు.

వజ్రకాయుణ్ణి జయించినవాడికి తన కుమార్తెనిచ్చి పెళ్ళిచేస్తానని రాజు ప్రకటించాడు.

ఆవెంటనే యెక్కడెక్కడ వున్న రాజకుమారులూ తిమిరద్వీపానికి బయలుదేరారు.

తిమిరద్వీపం ఒక చిన్నరాజ్యం. ఆనందనగరానికీ, ఆ ద్వీపానికీ మధ్య ఒక చిన్న సముద్రపుపాయ అడ్డు. ఆ ద్వీపపురాజైన వజ్రకాయుడు మహా బలశాలి. అతడు మరొక దేశంమీదికి దండెత్తేవాడుకాదు; తన ద్వీపంలోకి ఎవడు వచ్చినా శాస్తిచేయకుండా వదిలేవాడుకాదు.

పి. నీలకంఠం




రాజకుమారులు ఒక్కరొక్కరే తిమిర ద్వీపానికి బయలుదేరారని చెప్పాముకదా! వజ్రకాయుడు మహా బలశాలి అనీ, అజేయుడనీ తెలిసినా, భాసురాంగిని వివాహం ఆడవచ్చుననే ఆశతో చాలామంది తెగించి ముందుకు వచ్చారు.

తిమిరద్వీపానికి యెదురుగా యివతలి సముద్రపు ఒడ్డున చిన్న పడవలరేవు ఒకటి ఉన్నది. పడవ యెక్కి, ఆ చిన్న సముద్రపు పాయ దాటి తిమిరద్వీపంలో దిగడం ప్రారంభించారు వారంతా.

మొట్టమొదట వజ్రకాయుడితో యుద్ధానికి తలపడే అవకాశం కాంచనదేశ రాజకుమారుడికి కలిగింది. సముద్రపు ఇవతలి వొడ్డున వేలాదిప్రజలతో నిత్యానందుడూ, రాజకుమార్తే వేచివున్నారు. తిమిరద్వీపంలో దిగినతరవాత కనీసం ఒకగంట కాలమన్నా గడవకముందే కాంచనదేశపు రాకుమారుడు సముద్రంవైపు పరుగెత్తుకు రావడం అందరికళ్ళా పడింది.

మరొక గంటకల్లా రాజకూమారుడు ఈ రేవులో పడవమీదినించి దిగాడు. ప్రజలూ, రాజూ ఏంజరిగిందని ప్రశ్నించకముందే "అయ్యో, నా కుడిచేతి చిటికెనవేలు నరికివేశాడు. బాధ, బాధ! వైద్యులెవరూ లేరా?" అంటూ కేకలు పెట్టసాగాడు.

కాసేపటికల్లా వజ్రకాయుడు ఏంచేసిందీ అందరికీ తెలిసిపోయింది. తిమిరద్వీపంలో కాంచనదేశపు రాజకుమారుడు దిగీడగటంతోనే వజ్రకాయుడే స్వయంగా వచ్చి కత్తి యుద్ధంలో అతన్ని ఓడించి, తక్కిన రాజకుమారులకు హెచ్చరికగా ఉండేట్టు కుడిచేతి చిటికెనవేలుమాత్రం నరికి ప్రాణాలతో పోనిచ్చాడు.

"వేలు నరికి వదిలాడు; మెడ నరికాడు కాదు!" అంటూ అక్కడ చేరిన ప్రజలంతా వారిలో వారు నవ్వుకున్నారు.




తరవాత ఇంకొకదేశపు రాజకుమారుడు తిమిరద్వీపానికి బయలుదేరాడు. అతడికీ ఓటమి కలిగింది. కుడిచేతి చిటికెనవేలును మాత్రం కోసి, వజ్రకాయుడు అతన్ని ప్రాణాలతో వదిలేశాడు.

ఈవిధంగా పది పదిహేను రోజులయ్యేసరికి దేశదేశాలనుంచి వచ్చిన రాజకుమారులందరికీ వజ్రకాయుడు చిటికెనవేలు నరికి పంపటం మామూలైంది. ఏ రాజకుమారుడి హస్తాన్ని చూసినా ఐదువేళ్లకు బదులు నాలుగు వేళ్ళే కనిపించసాగినై! వాళ్ల బతుకు తలవంపు లయిపోయింది.

పరిస్థితులు ఇలా తయారయ్యేసరికి నిత్యానందుడు దిగులుపడిపోయాడు. రాజకుమార్తె భాసురాంగికూడా కలతపడింది. అప్పటికి వందలకొద్దీ రాజకుమారుల చిటికెనవేళ్లు, వజ్రకాయుడి కత్తికి బలిఐపోయినై. తరవాత ఏంచేయటమా అని అందరూ ఆలోచిస్తూవుండగా, యెక్కడినుంచో ఒక యువకుడు రాజదర్శనంకోసం వచ్చాడు.

"ప్రభూ! నేను రాజకుమారుణ్ణి కాదు; ఒక కాపుబిడ్డని. ఒకవేళ నేను వజ్రకాయుణ్ణి జయిస్తే, నాకు తమ పుత్రికను యిచ్చి వివాహంచేస్తారా?" అని అడిగాడు.

రాజు మంత్రికేసీ, కుమార్తెకేసీ ఓమారు చూశాడు. 'సరే' అన్నట్టు వాళ్ళు తలలు వూపగానే "వజ్రకాయుణ్ణి జయించినవాడు ఎవడైనా తప్పక జగదేకవీరుడే అవుతాడు. అలాంటివాడికి తప్పక నాకుమార్తెనిచ్చి వివాహంచేస్తాను" అన్నాడు రాజు.

ఆ వచ్చిన కాపుయువకుడు సెలవు తీసుకుని వెళ్ళిపోయాడు. వజ్రకాయుని చేత ఓడింపబడిన ప్రతిఒక్కడికీ కుడిచేతికి నాలుగువేళ్ళుమాత్రమే ఉంటవనేది యిదివరకే మనకుతెలుసు. ఒకసారి సముద్రం దాటి ఆ ద్వీపాన్నుంచి కుడిచేతికి ఉన్న ఐదు వేళ్ళతోనూ బయటపడగలిగితే—

వాడు ఆ వజ్రకాయుణ్ణి జయించినట్టే అనుకున్నారు రాజూ ప్రజలున్నూ.

ఈ సంగతి అంతా యెరిగివున్న ఆ కాపు యువకుడు గడ్డికోసే కొడవలి తప్ప, మరే కత్తి పట్టుకోవడం చేతకాకపోయినా, ధైర్యంగా వజ్రకాయుడిమీదకు యుద్ధానికి బయలుదేరాడు. వేలాది ప్రజలూ, రాజూ అంతా అతణ్ణి సాగనంపారు.

కాపుయువకుడు తిమిరద్వీపంలో దిగి కాలు పెట్టగానే వజ్రకాయుడు తళతళ మెరిసే కత్తితో తారసపడ్డాడు.

"ఎంతమందికి వేళ్లునరికి పంపినా, ఇంకా ఈ ద్వీపానికి వస్తూనేవున్నారు. యిక సొంతం మనిషినే నరికేస్తా. పీడ వదులుతుంది" అంటూ హుంకరించాడు.

దానికి కాపుయువకుడు వినయంగా—"మహాప్రభూ! నేను మీమీద యుద్ధంచేయకుండానే వోటమి అంగీకరిస్తున్నాను. ఆ చిటికెనవేలు కాస్తా నరికి పుచ్చుకున్నారంటే నాదారిని నేను పోతాను" అన్నాడు.

వజ్రకాయుడికి ఈ మాటలు ఎంతగానో ఆశ్చర్యాన్ని కలిగించినై. అయినా శ్రమ లేకుండానే పని ముగించుకోవచ్చు కనుక 'సరే' నని కాపుయువకుడి కుడిచేతిని పట్టుకుని, చివరి వేలు నరికివేసి, పొమ్మన్నాడు.

కాపుయువకుడు విచారించటానికి బదులు సంతోషిస్తూ, పడవఎక్కి తీరానికి చేరాడు. పడవ ఒడ్డుకు రాకముందే కుడి చేతితో ఒక పెద్ద కత్తిని ఝుళిపిస్తూ—"వజ్రకాయుడు ఓడిపోయాడు! చూడండి నా చేతివేళ్లను!" అంటూ కుడిచేతిని ఎత్తి తన ఐదువేళ్లనూ చూపించాడు.

అక్కడ చేరిన ప్రజలందరూ "జగదేక వీరుడికి జై!!" అని కేకలు వేయసాగారు. వెంటనే రాజకుమార్తె భాసురాంగి అతని మెడలో పూలమాల వేసింది. ఐతే, అతని చేతికి మొదట్లో ఆరు వేళ్లున్నాయని ఒక్కళ్లూ కనిపెట్టలేకపోయారు.






అనగనగా ఒక రాజు. ఆ రాజుకు లేకలేక ఒక ఆడపిల్ల. ఆమె అపరూప సౌందర్యవతి. ఆమె పెరిగి పెద్దదవుతున్నకొద్దీ ఆమె సౌందర్యం నానాటికీ ద్విగుణీకృతం కాసాగింది.

ఈ సౌందర్యరాశిని చూసి రాజుగారికి ఆనందంకలగడానికి బదులు అంతకంతకూ విచారం పెరగసాగింది. కారణమేమంటే, రాజకుమార్తె స్త్రీసహజమైన లక్షణాలేవీ అలవరచుకోలేదు. తండ్రి అనంతరం రాణి కానుండికూడా రాజ్యాంగవిషయాలేవీ తెలుసుకోలేదు.

ఆమెకు నడవనేర్చిననాటినుండీ ఒకటే వ్యసనం—పరిగెత్తడమనేది. తనకన్న వేగంగా ఏమానవుడూ, ఏజంతువూ, ఏపక్షీ పరిగెత్తరాదని ఆమె శపథం. చూపుమేరలో ఏ గుర్రం పరిగెత్తుతూ కనిపించినా రాజకుమారి పరుగు లంకించుకుని, దాన్ని దాటివెళ్ళినదాకా ఆగేదికాదు. అడవికి వెళ్లినప్పుడు వన్యమృగాలతో పరుగుతీసేది. ఉద్యానవనానికి వెళ్ళితే లేళ్ళకన్న వేగంగా పరిగెత్తేది. ఎంతసేపు పరిగెత్తినా, ఎంత దూరం పరిగెత్తినా ఆమెకు అలుపన్నది ఉన్నట్టే కనబడేదికాదు.

"ఈమెకన్న వాయుదేవుడు తప్ప మరెవరూ వేగంగా పరిగెత్తలేరు. ఈమె నిజంగా మారుతుడివరాన పుట్టింది," అని అందరూ అనేవారు. ఆమెకు 'మారుతి' అనే పేరు కూడా పెట్టేశారు.

ఈ వ్యసనంనుంచి ఆమెను తప్పించడానికి ఆమె దాసీలందరూ యత్నించారు. రాజమంత్రీ రాజపురోహితుడూ కూడా మారుతికి చెప్పిచూశారు. రాజుకు వృద్ధాప్యం వచ్చింది. ఏనాడైనా మారుతి శిరస్సుపై కిరీటభారం పడవచ్చు.

కిరీటధారికి ప్రజల గౌరవమూ, ప్రజానురాగమూ లేకపోయినట్లయితే పరిపాలన

సి. పద్మావతి



ఎంతగానో కష్టమవుతుంది. మారుతి గుర్రాలతోనూ, లేళ్ళతోనూ పరిగెత్తి గెలుస్తుందన్నంత మాత్రంచేత ప్రజలు గౌరవించరు. రాజ్యభారం వహించేవారి గొప్పలక్షణం పరిగెత్తడం కానేకాదు. మంత్ర తంత్ర ఆలోచనలలో నైపుణ్యం సాధించాలి. మారుతి తన దృష్టిని ఇకనైనా రాజ మర్యాదలమీదికి మళ్ళించాలి.

అదీగాక, మారుతికి యుక్తవయస్సు వచ్చింది. నేడో రేపో ఆమెకు వివాహం జరిగితీరాలి. పట్టాభిషేకం వాయిదా పడినా, వివాహం యెంతో కాలం వాయిదా వెయ్యడానికి వీలులేదు. చుట్టుపక్కల రాజకుమారులలో అర్హుడైనవాణ్ణి యెవరినన్నా చూసి మారుతి వరించినపక్షాన మిగిలిన విషయాలు చూసేటందుకు పురోహితుడూ మంత్రీ ఉన్నారు. కాని, ఒక్క విషయం : మారుతి తన ధోరణి మార్చుకోకపోతే ఉన్నత వంశానికి చెందిన రాకుమారుడెవడూ ఆమెను పెళ్ళి చేసుకోడు.

పురోహితుడూ, మంత్రీ చెప్పిన ఈ మాటలన్నీ మారుతి సావధానంగా విన్నది. చివరకామె, "సరే నావివాహం ఏర్పాటు చేయండి. నాకు మీ రాకుమారు లెవరూ అక్కర్లేదు. పరుగులో నన్ను గెలిచేవాణ్ణి మాత్రమే నేను పెళ్ళాడతాను. ఇంకెవరూ నన్ను పెళ్ళాడడానికి అర్హులు కారు", అన్నది.

మంత్రి నిర్ఘాంతపోయినాడు. పురోహితుడి నోట మాటే లేదు.

"సరేనమ్మా. మీరు చెప్పినట్టే చేద్దాం. పరిసర దేశాలకు వార్త పంపుతాను," అన్నాడు మంత్రి.

"ఒక్క నియమం కూడా ఉంది," అన్నది మారుతి. "నేను పరువు గల రాజకుమార్తెను. నన్ను పెళ్ళాడే ఆశకొద్దీ ప్రతి

నీచుడూ నాతో పందెం వెయ్యవచ్చు. నాతో పరిగెత్తి ఓడిన ప్రతివాడికీ శిరచ్ఛేదం జరుగుతుందనికూడా చాటించండి."

"చిత్తం!" అన్నాడు మంత్రి.




## 2

మారుతి స్వయంవరం చాటింపు విని అన్ని దేశాలవారూ ఆశ్చర్యపోయారు. పరుగు పందెంద్వారా భర్తను ఎన్నుకున్న రాజకుమార్తెను గురించి ఎవరూ ఎన్నడూ విని ఉండలేదు. ఇటువంటి గాథ ఏ పురాణంలోనూ లేదు.

ఆఖరుకు సీతా స్వయంవరంలోనైనా పెళ్ళాడవచ్చినవారు ఒకరితో ఒకరు పోటీ చేశారుగాని పెళ్ళికూతురుతో పందెంపడిన వారు లేరు.

మారుతి సౌందర్యంగురించి విన్నవారు కొందరు ఆమెకోసం శిరచ్ఛేదం చేయించుకున్నా ఫరవాలేదనుకుని ఆమెతో పందెం వెయ్యడానికి బయలుదేరి వచ్చారు. కొందరు రాజ్యకాంక్షతో మారుతి స్వయంవర పోటీకి బయలుదేరారు. ఆమె వేగంగురించి విననివారు, "ఒక ఆడదానితో పరిగెత్తలేమా?" అని వచ్చారు. పరిగెత్తడంలో ప్రసిద్ధులైనవారు అనేకమంది ఆమెను జయించాలన్న అహంకారంతో వచ్చారు. మరికొందరు చాటింపు వింటూనే పరిగెత్తడంలో శిక్షణ ప్రారంభించారు.

మారుతి స్వయంవరం చాటింపు జరిగిన మర్నాటినుంచీ వివిధ దేశాలనుండి అభ్యర్థులు రాసాగారు. వారిలో విఖ్యాతులున్నారు, అనేకరకాల ప్రతిభావంతులున్నారు, ఉన్నత రాజవంశాలవారున్నారు, అత్యంత సౌందర్యవంతులైన నవమన్మథులున్నారు. కాని ఒక్కరుకూడా పరుగుతీయడంలో ఆమెకు దీటైనవారు కనిపించలేదు. ఉదయం లగాయతు అస్తమయం అయ్యే



మాట్లాడుకున్నారు. ఆమె పాషాణహృదయ అని కొందరన్నారు. ఆమె తప్పు లేదనీ, ఆమెతో పరిగెత్త సాహసించినవారిదే తప్పనీ మరికొందరన్నారు. ఈవిధంగా పోటీ సాగితే చుట్టుపక్కల గల యువకులంతా నిర్మూల మైపోతారని కొందరన్నారు. అసలు మారుతికి వివాహమే కాదు, చూస్తూ ఉండమని మరికొంద రన్నారు.

మారుతిని పెళ్లాడవచ్చిన వారిలో చచ్చే వారు చస్తూవుంటే వచ్చేవారు వస్తూనే ఉన్నారు. యజ్ఞపశువులలాగా బలి అయిపోతూనే ఉన్నారు.

వరకూ మారుతి ఎందరితోనైనాసరే పరిగెత్తడానికి సిద్ధురాలుగా ఉంది. రాజభవనం ముందు రెండుబారలమేర పోటీకి ప్రత్యేకించారు. చుట్టూ ప్రేక్షకులు నిలబడడానికి ఏర్పాటు చేశారు. పోటీదార్లు పరిగెత్తేచోటుకు ఒకపక్కగా వధ్యశిల ఏర్పాటుచేశారు. ఓడిపోయిన మరుక్షణం పోటీదారు వధ్యశిల వద్దకు పోయి శిక్ష పొందవలసిందే.

మొదటిరోజున ఈ వధ్యశిలనుంచి పన్నెండు తలలు రాలాయి. ప్రతి శిక్షకూ ప్రేక్షకులు హాహాకారాలు చేశారు. మారుతిని గురించి అనేకులు అనేకరకాలుగా

ఈ విధంగా ఈ దేశానికి వచ్చినవారిలో కుమారుడనే యువకుడొకడున్నాడు. అతను కావడానికి ఒక రాజకుమారుడేగాని అతని చిన్నతనంలోనే తలిదండ్రులను కోల్పోయి శత్రురాజులచేత రాజ్యభ్రష్టత్వం పొంది, దేశదేశాలు తిరుగుతున్నాడు. కుమారుడు ఈ దేశానికి వచ్చి ఇక్కడ జరిగే భీకరస్వయంవరంగురించి విన్నాడు. నలుగురితోబాటు ఒక ఉదయం తానుకూడా పరుగుపందాలు జరిగేచోటికి వచ్చాడు.

అనాటి తొలి నరపశువుతో పరుగుతీయడానికి సిద్ధంగా నిలబడివున్న మారుతి,



కుమారుడి కంటికి కనిపించిన మరుక్షణం, అతనికి మిగిలిన ప్రపంచమంతా లేకుండా పోయింది. ఆమె తప్ప అతనికంటికి మరేమీ కనిపించలేదు.

ఆమె ఒకడితో పరిగెత్తి గెలిచింది. ఆ అభాగ్యుణ్ణి వధచేశారు. ప్రజలు హాహా కారాలు చేశారు. కాని కుమారుడి కళ్ళకు మారుతి తప్ప ఆమెతో పందెంవేసి ఓడిపోయిన అభాగ్యుడుగాని, అతని శిరచ్ఛే దంగాని కనిపించలేదు; ప్రజల హాహాకా రాలుకూడా అతని చెవులకు వినిపించలేదు. ఆరోజు పందాలు పూర్తి అయేదాకా కుమారుడు అక్కడే నిలబడి మారుతినే చూశాడు.

ప్రజలు నిష్క్రమించారు. కుమారుడు కూడా కదిలాడు. కాని యెటు పోతున్నదీ అతనికి తెలియదు. నేరుగా ఊరిబయటికి వెళ్ళాడు. నదిఒడ్డున అడవిలో కాలిబాటల వెంట నడిచి పాడుబడిన ఒక దేవాలయం చేరుకున్నాడు. లోపల ప్రవేశించాడు. అది ఒక పార్వతీదేవి ఆలయం.

అక్కడికెవరూ వెళ్ళరు. ఆలయంలో పరిచిన రాళ్ళమధ్యగా యేవేవో పిచ్చి మొక్కలు పెరిగాయి. లోపలి రాళ్ళన్నీ పాచిపట్టివున్నాయి. అక్కడ తొండలూ, ఊడ తలూ, ఇతర క్రిమికీటకాలూ, చిన్నచిన్న పిట్టలూ యథేచ్ఛగా సంచరిస్తున్నాయి.

పార్వతీదేవి విగ్రహం చూడగానే కుమా రుడి హృదయంలో పొంగే భావాలన్నీ పైకి పొర్లాయి. అతను ఆవిగ్రహం ముందు మోకరించి కాళ్లుపట్టుకుని ఈ విధంగా చెప్పుకోసాగాడు:

"తల్లీ, పార్వతీ! నీవు మా కులదేవతవు. నేను యెన్నోకష్టాలు పడ్డాను. కాని నిన్ను ఎన్నడూ ఏమీ కోరలేదు. ఇప్పుడు ఒకే ఒక కోరిక కోరుతున్నాను. నాయందు దయ



వుంచి ఈ నాకోరిక చెల్లించు. ఎట్లాగైనా మారుతిని నాకు భార్యగా చెయ్యి. నాకు రాజ్యాలవసరంలేదు. భోగభాగ్యాలవసరం లేదు. ఒక్క మారుతిచాలు. నాకు ఈ మారుతి తప్ప ప్రపంచంలో ఇంకేమీ అవసరం లేదు. నీపాదాల తోడు.

"అమ్మా, మారుతి అమాయకురాలు, అజ్ఞానురాలు. ఆమెకు ప్రేమ యేమిటో తెలియదు. తెలిస్తే ఈవిధంగా భర్తకొరకు పందెం వెయ్యదు. ఆమె హృదయంలో ప్రేమజ్వాల రగుల్చు. తల్లీ, నాకు నీవుతప్ప ఇంకెవరున్నారు. నీవు నాకు మారుతిని చేకూర్చలేని పక్షాన నాజన్మ వృథా. అంత దాకా నేను నీపాదాలువదలను.

"చావు ఎప్పటికైనా తప్పనిదే. ఒక చెంప ప్రేమతో దహించుకుపోతున్న నేను ఎంతోకాలం జీవించలేను. నీకు నాపై అనుగ్రహం కలగనిపక్షాన నీ పాదాలదగ్గిరే ప్రాణం విడుస్తాను."

3

మూడు పగళ్లూ మూడు రాత్రులూ కుమారుడు నిద్రాహారపానీయాలు లేకుండా అదేవిధంగా పార్వతీదేవి పాదాలు ఆశ్రయించాడు. మూడవరాత్రి మూడు ఝాములు గడిచింది. దూరాన తొలికోడి కూసింది. అంధకారమయంగా వున్న శిథిల దేవాలయం ఒక్కసారిగా వెలిగింది. కుమారుడు తలయెత్తి చూశాడు. మెరుపును మించిన వెలుగుతప్ప అతనికేమీ కనిపించ లేదు. ఈమాటలు మాత్రం వినిపించాయి:

"నాయనా, విచారించకు. నీ అభీష్టం తీరుస్తాను. శక్తిచేత నీవు మారుతిని జయించలేవు. యుక్తితో జయించు. నీకు మూడు బంగారు నిమ్మపళ్లిస్తాను. నీవు మారుతితో పరుగుపందెం వేసినప్పుడు ఆమె నిన్ను దాటిపోయే సమయంలో ఒక పండును

బలంగా వెనుకకు విసిరివెయ్యి. అవసర మైతే మూడు పళ్లనూ ఉపయోగించి నీకోరిక తీర్చుకో."

క్షణంలోనే అంత కాంతీ మాయ మయింది. ఆ సమయంలోనే ఏదో చల్లని చెయ్యి తగిలినట్టయింది. ఆ స్పర్శతో కుమారుడికి ఆవేదనా, ఆకలిదప్పులూ మాయమయాయి. పార్వతీదేవి కాళ్లమీది నుంచి అతను చేతులు తీసివేశాడు. అతని దోసిట్లో మూడు నిమ్మపళ్ళు బంగారపు రంగులో తళతళలాడుతున్నాయి. అతను వాటిని కళ్లకద్దుకుని, గుడిబయటికి వచ్చి, నదిలో స్నానంచేసి స్వయంవరానికి బయలుదేరాడు.

అప్పుడే తెల్లవారింది. జనం చేరు తున్నారు. మారుతి పోటీదారులకోసం సిద్ధంగా వుంది. ఆమె హృదయం శిల. అతనికి ఆసంగతి తెలిసే ప్రేమించాడు. ఆ శిలను ద్రవింపజేయటానికి పార్వతీదేవి ఉండనే ఉన్నదని నమ్మాడు.

పందానికి ఏర్పాట్లన్నీ పూర్తి అయాయి. ఇద్దరూ ఒకరిపక్క ఒకరు నిలబడ్డారు. బయలుదేరడానికి సంకేతం యెప్పుడు వస్తుందా అని యిద్దరూ వేచివున్నారు. సంకేతం వచ్చింది. ఆ క్షణంలోనే కుమా




రుడు ఒక నిమ్మపండు తీసి పక్కకు విసి రాడు. అది లేత ఎండలో మిలమిలా మెరుస్తూ అతివేగంగా జనంకేసి పోసాగింది.

మారుతి కళ్ళు జిగేలున మెరిశాయి. అతివేగంగా దొర్లుకుంటూపోయే ఆ నిమ్మ పండు తనను సవాలుచేస్తున్నట్టయింది. ఆ పండువెంబడి పరిగెత్తి, అది జనంమధ్యకు పోయేలోపుగా వొంగి దాన్నిపట్టుకుని కుమా రుడికేసి చూసింది. అతనప్పుడే పదిహేను బారలు పరిగెత్తాడు.

మారుతికి ఎక్కడినుండో కొత్తశక్తి వచ్చినట్టయింది. ఆమె శరవేగంతో అతన్ని చేరుకోసాగింది. చేరుకున్నది. ఇంకొక్క

క్షణంలో ఆమె ముందుకు వెళ్ళిపోతుందనగా కుమారుడు రెండో నిమ్మపండు తీసి బలంగా వెనక్కు విసిరేశాడు. మారుతి దాని పిలుపును తృణీకరించలేకపోయింది. తన పందెంమాటే మరిచిపోయి ఆమె దాని వెంట పరిగెత్తి, అది ఆగేలోపుగా వొంగి దాన్ని అందుకుని లేచి నిలబడింది. ఈపాటికి కుమారుడు అరవైబారలు దాటి ఇంకా ముందుకు పోతున్నాడు.

మారుతి కాళ్లలోకి ఎవరూ ఊహించలేని జవసత్వాలొచ్చాయి. ఆమె తుఫాను గాలిలాగా కుమారుడికేసి పరిగెత్తసాగింది. అతను పదిబారలు పోయేలోగా ఆమె మళ్లీ అతన్ని చేరుకుంది. మరొక లిప్తలో దాటిపోతుందికూడానూ. ఆసమయంలో కుమారుడు మూడో నిమ్మకాయ తీసి తనకు మిగిలివున్న శక్తినంతా వినియోగించి వెనక్కు విసిరివేశాడు.

మారుతి ఆగింది. దాదాపు కాళ్ళలో శక్తి వుడిగి రొప్పుతూ పరిగెత్తే కుమారుణ్ణీ, అతివేగంగా రెండోవైపు దొర్లిపోయే నిమ్మకాయనూ చూసింది. నిమ్మకాయవెంట పరిగెత్తింది. ఆమె కాయ అందుకునేసరికే కుమారుడు తొంభైఅయిదు బారలు పరిగెత్తాడు. ఇంకా అయిదుబారలున్నాయి.

అతణ్ణి కలుసుకోవటానికి మారుతి తీసిన పరుగు మనుష్యమాత్రులు ఊహించలేనిది. ఆమె కలుసుకోకపూర్వమే కుమారుడు గమ్యస్థానం చేరుకున్నాడు.

ప్రజల హర్షధ్వానాలు మిన్నుముట్టాయి. ఓటమి ఎరగని మారుతి ఓడిపోయింది. దినదినమూ జరిగేవధలు ఆగిపోయాయి.

వధ్యశిలవద్ద నిలబడివున్న రాజభటులు గండ్రగొడ్డలి అవతల పారేసి పూలమాల తెచ్చి మారుతి చేతికిచ్చారు. ఆ మాలను ఆమె, కుమారుడికి మెడలో వేసేటప్పుడు ఆమె కనురెప్పలు వాలాయి, చెక్కులు కొద్దిగా జేవురించాయి. మొట్టమొదటిసారిగా మారుతిలో కనిపించిన స్త్రీ లక్షణాలకు రాజపరివారం ఎంతో ఆనందించింది.



# కన్నులను నమ్మవచ్చా?

అప్పుడప్పుడు మనమేదైనా అసంభవమైన విషయంచూచి 'నాకళ్ళను నేనే నమ్మలేకపోయాను' అంటాం. మాటవరసకు అలా అంటామేకాని, కళ్లను నమ్మనివారు చాలా అరుదు. దానికి నిదర్శనమేమిటంటే : ఎవరైనా ఒక విషయం గట్టిగా చెప్పాలనుకున్నప్పుడు 'కళ్ళారా చూచా'నంటారు. కాని కళ్ళారా చూచినది కూడా పొరపాటు కావచ్చు.

మన ఇతర యింద్రియాలవలెనే, కన్నులుకూడా అప్పుడప్పుడు పొరపడుతుంటాయి. ఈ క్రింది బొమ్మ చూడండి. ఎడమపక్కని ఒక అడ్డగీత ఒక × గురుతు, కుడివైపున ఒక నల్లనిచుక్కా ఉన్నాయి. మీచూపు ఒక్కొక్క తరుణంలో పనిచెయ్యదు అని రుజువు కావాలంటే, ఎడమకన్ను మూసికొని కుడి కంటితో × గుర్తును చూడండి. ఈ గురుతులను ముందు ఒక అడుగు దూరాన



ఉంచుకుని, మెల్లిగా కన్నులదగ్గరగా జరుపుతూవుండండి. × గుర్తును చూస్తూ వున్నప్పటికీ, మీకు నల్లచుక్కకూడా కనిపిస్తూనేవుంటుంది.

కాని, కొంతదూరం వచ్చేసరికి, ఆ చుక్క మాయమైపోతుంది. ఐతే— కాగితం ఇంకా కొంత దగ్గరకు జరిగిన తరవాత నల్లచుక్క మళ్ళీ కనిపిస్తుంది.



2. పక్కన రెండు చదరాలున్నాయి—ఒకటి తెల్లనిది, రెండవది నల్లనిది. రెండింటిలో పెద్దది యేది?—ఎక్కువమంది తెల్లచదరమే పెద్దదని చెబుతారు. కాని, వాస్తవానికి తెల్లచదరం నల్ల దానికంటె చిన్నది.

3. ఈ అడ్డగీతలు, నిలువుగీతల వరస చూడండి. ఒక వరుస అడ్డంకంటె నిడివి ఎక్కువ ఉన్నట్టు కనుపిస్తుంది. రెండవవరస నిడివికంటె అడ్డం ఎక్కువ ఉన్నట్టు కనిపిస్తుంది. కాని, నిజానికి రెండూ నలుచదరంగానే వున్నాయి.





ఇప్పుడు చెప్పండి, కండ్లను నమ్మ వచ్చునంటారా?




# ఆడకోతి

పూర్వం కాంచీపురరాజ్యాన్ని కనకసేను డనే రాజు పాలిస్తూవుండేవాడు. ఆయన చాలా విలాసపురుషుడు. దూరదేశాలనుంచి కూడా అనేకరకాల పూలమొక్కలూ వృక్షజాతులూ తెచ్చి, రాజభవనంవెనక చక్కని ఉద్యానవనం పెంచాడు.

అందమైన ఆ ఉద్యానవనంలో, అతి మనోహరమైన కొలను తవ్వించాడు. కొలను చుట్టూ పెద్దపెద్ద చెట్లూ, వాటిని అల్లుకుని రకరకాల పుష్పలతలూ ఉన్నాయి.

ఒకనాడు కాంచీపురరాణి కొలనుకు స్నానానికని వెళ్లింది. కొలనులో దిగుతూ తను ధరించిన నగలన్నీ దాసీదాని చేతికి ఇచ్చింది. వాటిలో ఒక అమూల్యమైన రత్నాలహారంకూడా వుంది.

రాణి యిచ్చిన నగలన్నిటినీ దాసీది కొలను ఒడ్డున పెట్టి, అక్కడ చేతికి అందిన చెట్లనుంచి పూలు కోయసాగింది. ఇంతలో అక్కడ చెట్లపైన వుండే ఒక ఆడకోతి హఠాత్తుగా కిందకు దూకి ఆరత్నాలహారాన్ని అందిపుచ్చుకొని, ఒక్కగంతులో మళ్లీ చెట్టు ఎక్కసింది.

హారాన్ని కోతి ఎత్తుకుపోవటం దాసీది చూసింది. కాని ఏంచేయటానికీ తోచక చూస్తూవుండిపోయింది. ఇంతలో రాణి కొలనునుండి బయటికి వచ్చి, దుస్తులు ధరించి, నగలలో తన రత్నాలహారం కనబడకపోయేసరికి దాసీదానిని అడిగింది.

"ఏమోనమ్మా, మీరు ఇచ్చిన నగలన్నీ యిక్కడే పెట్టాను!" అన్నది దాసి, రాణి కోపగిస్తుందేమో నన్న భయంతో.

రాణి వెళ్ళి రాజుతో యీ దొంగతనం సంగతి చెప్పింది. రాజు మంత్రిని పిలిపించి సూర్యాస్తమయంలోపల దొంగను పట్టి తీసుకురావాలని అజ్ఞాపించాడు. రాజాజ్ఞ ప్రకారం మంత్రి వెంటనే దండనాయకుణ్ణి

డి. సుబ్రహ్మణ్యం




పిలచి జరిగినదంతా వివరించి, సూర్యాస్తమయంలోపల రత్నాలహారంతో సహా దొంగను పట్టి ఒప్పగించకపోతే వుద్యోగానికి తిలోదకాలేనని గట్టిగా చెప్పాడు.

దండనాయకుడు యుద్ధానికి వెళుతున్నట్టుగా వందలకొలది సైనికులతో బయలుదేరాడు. పట్టణం అంతా గాలించి వేశాడు. దొంగ యెవడో, యెలా వుంటాడో యెవరికీ తెలీదు. కాని, దొంగతనం చేసినవాడు తప్పక బీదవాడై వుంటాడనీ, బీదవాడైతే మాసిన దుస్తులతో, పెరిగిన గడ్డంతో వుంటాడనీ వారి నమ్మకం.

చివరికి పట్టణమూ, ఆ చుట్టుపట్ల వున్న అడవులూ వెదికి సూర్యాస్తమయంలోపల ఒక చింకిగుడ్డలవాణ్ణి కోటకు లాక్కొని వచ్చారు. దొంగ దొరికాడని వినగానే రాజు తక్షణం దర్బారుకు వచ్చాడు.

"రత్నాలహారం యెక్కడ దాచావు?" అని గద్దించి ప్రశ్నించారు రాజుగారు. దొంగిలించలేదంటే యెవ్వరూ నమ్మరనీ, ఆ నిమిషానే వురితీయిస్తారనీ భయపడి, ఆ బీదవాడు "రత్నాలహారం, కోశాధిపతిగారికి యిచ్చానండీ!" అన్నాడు. ఇలా అన్న వెంటనే కోశాధిపతిని రెక్కలు విరిచికట్టి రాజుముందుకు లాక్కొని వచ్చారు. రాజు అదేప్రశ్న మళ్లీ అడిగాడు. కోశాధిపతికి రాజు మనస్తత్వం తెలుసు; కనుక తడుముకోకుండా "మన ఆస్థానజ్యోతిష్కుల వారికి యిచ్చానండీ!" అన్నాడు.

ఆస్థానజ్యోతిష్కుణ్ణి కాళ్లూ చేతులూ కట్టి తెచ్చి రాజుగారిముందు నిలబెట్టారు. రాజు అంతకుముందు ఇద్దరినీ ప్రశ్నించినట్టే మళ్లీ ప్రశ్నించాడు. దానికి జోతిష్కుడు తడబడకుండా "మంత్రిగారి పెద్దకుమారుడికి యిచ్చానండి!" అన్నాడు. ఇంతవరకు విచారణ జరిగేసరికి చాలా పొద్దుపోయింది.




జైలు గదిలోపలనుంచి సన్నగా ఏడుపు వినబడింది. మంత్రి అలానే తలుపుదగ్గిరసా చెవిపుంచి వింటున్నాడు. ఇంతలో ఆ యేడుపు ఆగిపోయింది. అదేసమయాన బీదవాడి గొంతుక యిలా అన్నది :

"కోశాధిపతిగారూ! నన్ను క్షమించాలి. ప్రాణభయంవల్ల అలా మీమీద అబద్ధం చెప్పేశాను. నిజానికి ఆ రత్నాలహారాన్ని గురించి నాకేమీ తెలియనే తెలియదు."

తరవాత కోశాధిపతి: "జ్యోతిషుల వారూ! నన్ను క్షమించాలి. ప్రాణభీతివల్ల మీమీద చెప్పేశాను. జ్యోతిష్కులు గనక, నిజం తెలుసుకోగలరుకదా అని అలా అనేశాను" అన్నాడు.

ఇక జ్యోతిష్కుడు ప్రారంభించాడు: "జ్యోతిషం, నా శ్రాద్ధమూను! యిలాంటి దొంగతనాలు జ్యోతిషానికి అందేవికావు; అందుకే మంత్రికొడుక్కి వుచ్చువేశాను."

ఇంతవరకూ అందరి మాటలూ విన్న మంత్రికి రహస్యం తెలిసిపోయింది. సరాసరి అర్ధరాత్రివేళ రాజుదగ్గరకు పోయి, నిద్ర లేపి, తను విన్నదంతా చెప్పేశాడు.

మంత్రి చెప్పినదంతా విని, రాజు ఒక పెద్ద నిట్టూర్పు విడిచాడు. తన రాణికి

అందుచేత "తతిమ్మా వ్యవహారం అంతా రేపు వుదయం చూసుకుందాం. నేరస్థులను మాత్రం ఖైదులో వేయండి!" అని చెప్పి రాజుగారు లేచిపోయారు.

ఆరాత్రి మంత్రికి నిదురపట్టలేదు. రత్నాలహారం పోవడం, ఆ దొంగతనం యెవడో బీదవాడితో ప్రారంభమై చివరకు తన కొడుకుమీదికి రావడం—అంతా చిత్రంగా తోచింది. అర్ధరాత్రిసమయాన పడకగదినుంచి బయలుదేరి సరాసరి నేరస్థులు బంధింపబడిఉండే గదితలుపు దగ్గరకు వెళ్ళి చెవిఒగ్గి వినసాగాడు.




ప్రాణప్రదమైన ఆ వెలలేని రత్నాలహారం యెవరు దొంగిలించినట్టు?—తెల్లవార్లూ రాజుకు యిదే ఆలోచన.

తెల్లవారింది. రాజు దాసీదానిని ఎదటికి పిలిపించాడు. 'నిజం చెప్తావా, లేకపోతే నిన్ను ముక్కలుముక్కలుగా నరికించి, కాకులకూ గద్దలకూ వేయించమంటావా?' అని బెదిరించాడు.

దాసీది హడిలిపోయింది.

"మహారాజా! నేను నిర్దోషిని. కాని కొలనుపక్కని రావిచెట్టుమీద నివసించే ఆ అడకోతిమీదమాత్రం నాకు అనుమానమున్నది!" అని చెప్పింది.

"ఆ అడకోతిమీద ఎందుకని నీకు అనుమానం! అది నీకన్న అందంగా వుందనా?" అన్నాడు రాజు, గుడ్లెర్రజేస్తూ.

"లేదు ప్రభూ! అది అమ్మగారిలాగే వయ్యారంగా నడవాలని ప్రయత్నించడం నేను చూశాను. అమ్మగారు కొలనులో స్నానంచేస్తున్నంతసేపూ, అదికూడా చెట్ల కొమ్మలమీద స్నానంచేస్తున్నట్టు అభినయించేది. అమ్మగారిలాగానే కనపడీకనపడనట్టు చిరునవ్వు నవ్వాలనికూడా ప్రయత్నించటం నేను చూశాను!" అన్నది.

రాజుగారికి, దాసీదాని మాటలు వినేసరికి అరికాలుమంట నెత్తికెక్కినట్టయింది. దాసీదానిని నిలువునా నరికేద్దామనుకున్నాడు. కాని రత్నాలహారం సంగతి గుర్తుకొచ్చి శాంతం వహించాడు.

"ఐతే, రత్నాలహారం ఆ అడకోతే దొంగలించిందంటావా? బాగానే వుంది. మరి ఆ హారాన్ని అదెక్కడ దాచిందో తెలుసుకోవడం ఎలా?" అన్నాడు రాజు.

"అదేమంత కష్టంకాదు ప్రభూ!" అని మెల్లగా అంటూ ముసిముసినవ్వులు నవ్వింది ఆ దాసీది.

"ఎందుకని కష్టం కాదు?" అని అడిగాడు రాజు ఉగ్రుడై.

"తమరు భవనంలో వున్నప్పుడేగదా రాణీగారు ఆ రత్నాలహారాన్ని ధరిస్తారు?" అని ఎదురు ప్రశ్న వేసింది దాసీది.

"కావొచ్చు!" అన్నాడు రాజు కనుబొమలు చిట్లిస్తూ.

"ప్రభూ! తమకు నా మీద కోపం రావొచ్చు కనక, అంత వివరంగా చెప్పలేను. కాని, ఆ ఆడకోతి రత్నాలహారాన్ని ఎక్కడ దాచిందో కనుక్కోవాలంటె, మనం ఒక మగకోతిని తీసుకొనివస్తే వెంటనే తెలిసిపోతుంది!" అన్నది దాసి.

దాసీదాని మాటలలోని అంతరార్థం గ్రహించి, రాజు చిరునవ్వు నవ్వుకున్నాడు. రాణీని ఆడకోతితోను, తనను మగకోతి తోనూ అది పోల్చుతున్నదని గ్రహించాడు. కాని, యెలాఅయినా ముందు ఆ రత్నాల హారం రాబట్టుకోవాలిగదా!

రాజు ఆజ్ఞాపించగా, క్షణాలమీద ఒక మగకోతిని తెచ్చారు. రాజోచితంగా దానిని అలంకరించారు. ఆ మగకోతి వెనుక రాజూ, మంత్రి మొదలైనవారు అందరూ సపరివారంగా ఉద్యానవనంలోకి వెళ్ళారు.

రావిచెట్టుమీద నివసిస్తున్న ఆడకోతి యిదంతా చూచింది. ఒక్కగంతులో ఆ పక్కనవున్న చెట్టుతొర్రలో జొరబడి, అక్కడ దాచివుంచిన రత్నాలహారం బయటికి తీసి, మెడలో వేసుకున్నది. తరువాత చెట్టుదిగి, రాణీగారిలాగే వయ్యారంగా నడుస్తూ, మగకోతివేపు బయలుదేరింది.

రాజభటులు ఆడకోతిని పట్టుకుని, దాని మెడలోని రత్నాలహారం లాక్కున్నారు. అది కీచుకీచుమంటూ తిరిగి చెట్టుమీదకు పారిపోయింది.

రత్నాలహారం రాణికి యిచ్చి, నిర్దోషులందర్నీ వదిలేశారు. అందరితోపాటు రాజూ, దాసీదాని తెలివిని మెచ్చుకున్నారు.






ఒకప్పుడు గురుగోవిందసింగు 'ఆనందపుర' వీథులలో పాదచారిగా వెళుతున్నాడు. ఆయన మంచి విలువయిన దుస్తులను ధరించివున్నాడు. అనేకమంది శిష్యులు వెంట వున్నారు.

వెళ్ళగా వెళ్ళగా, ఒకచోట చిన్న ఇరుకు సందు తగిలింది. ఆ సందులో, ఒక తాపీ మేస్త్రి ఒక యింటిపైన వుండి మరమ్మతు చేస్తూవున్నాడు.

ఆ సందులోనించి వెళుతూవుండగా పొరపాటున, తాపీవాని చేతిలో ఉండే అడుసు గురుగోవిందు గౌనుమీద చిలికింది.

ఆమట్టున గురువువెంట నున్న శిష్యులకు చ్రురుమని కోపంవచ్చేసింది. 'ఏమిరా, దారంటపోయే మనుషుల్ని చూచుకోవా? నీ కింత పొగరా?' అంటూ తిట్టిపోశారు.

గురుగోవిందు కూడా వెనక్కి తిరిగి చూచాడు. మేస్త్రి అడుసుతో పనిచేయటం కనిపించింది. అప్పుడు గురుగోవిందు తన వెంటనున్న శిష్యులతో 'వాణ్ణి ఒక్క లెంపకాయ వెయ్యండి' అన్నాడు ఆజ్ఞా పూర్వకంగా.

ఈ మాట వినగానే, గురువు ఆజ్ఞప్రకారం మేస్త్రీని అందరూ తలకొక లెంపకాయా వేశారు. తాపీవాని ముఖం యెర్రబడింది. 'నావల్ల తప్పువచ్చింది. క్షమించండి బాబూ!' అంటూ వాడు వేడుకున్నాడు.

గురూజీ ఆ మేస్త్రిని దగ్గరకు పిలిచాడు. శిష్యుల్ని పిలిచాడు. 'అబ్బాయిలూ!— నేను అతన్ని ఒక్క లెంపకాయ కదా కొట్టమన్నది. అటువంటప్పుడు మీరంతా కలిసి యెందుకు వానిని చావమోదారు?' అని అడిగాడు.

అందుకు ఆ శిష్యులు ఏమీ జవాబు చెప్పలేక తెల్లబోయారు. అందులో ఒక శిష్యుడు ముందుకు వచ్చి, "గురూజీ!— మీరు ఏ ఒక్కరినీ నిర్దేశించి ఈ పని చెప్పలేదు. కనుక, ఎవళ్ళమట్టుకు వాళ్ళమే మి

కె. కల్యాణి

ఆజ్ఞను నెరవేర్చాలెననే ఆత్రంతో పోయి, వానిని తలకొక లెంపకాయా వేశాము" అని చెప్పారు.

ఈమాట వినగానే, గురుగోవిందు ఆ తాపీమేస్త్రిని బుజ్జగించి, 'నాయనా!—నీకు పెళ్ళి అయిందా?' అని ప్రశ్నించాడు.

'లేదు' అన్నాడు వాడు.

అప్పుడు ఆయన శిష్యులవేపు తిరిగి, 'మీరందరూ నాకు ప్రియమైన శిష్యులు. నా నోటివెంబడి మాట వచ్చేసరికల్లా అంది పుచ్చుకొని ఆచరణలో పెట్టగలరు.

'ఇందాక, ఈ పనివాని విషయంలో నేను చెప్పేసరికల్లా ఎంతో వినయవిధేయత లతో నాఆజ్ఞ నెరవేర్చారు.

'ఇప్పుడు అతని విషయంలోనే మరొక ఆజ్ఞ యిస్తున్నాను. వెంటనే నెరవేర్చాలి— అతనికి పెళ్లికాలేదింకా. ఎవరివద్ద ఆడ పిల్లలుంటే వారు అతనికిచ్చి పెళ్లిచేయండి!' అన్నాడు.

శిష్యులందరూ ఒకరి మొగా లొకరు చూచుకోసాగారు.

అందరిలోనూ ఒక్క శిష్యుడుమాత్రమే ముందుకు వచ్చి 'నేను నా కూతురును అతనికిచ్చిపెళ్లిచేసి గురువాజ్ఞ నెరవేరుస్తాను' అన్నాడు. గురుగోవిందు మెచ్చుకొన్నాడు. అందరూ ఆశ్చర్యపోయారు. అతడే గురు గోవిందసింగ్ నిజశిష్యులలో ఒకడై గురువు దీవనలు పొందాడు.

అప్పుడు గురుగోవిందు—పైకబుర్లుచెప్పే మామూలు శిష్యులకూ, ఎటువంటి త్యాగాని కైనా సిద్ధపడి గురువాజ్ఞ నెరవేర్చగల నిజ శిష్యునికీ తారతమ్యం చూపించాడు.

ఇది విని తక్కిన శిష్యులంతా సిగ్గుతో తల వంచుకొన్నారు.



## బదులు చెప్పు

1. ప్రపంచంలోకల్లా విశాలమైన దేశం ఏది ?—
   - అమెరికా
   - చైనా
   - రష్యా
2. భారతదేశానికి వచ్చిన మొట్టమొదటి గవర్నల్ జనరల్ ఎవరు ?—
   - క్లయివు
   - వారన్‌హేస్టింగ్స్
   - డల్హవుసీ
3. ప్రపంచంలోకల్లా పెద్ద పక్షి ఏది ?
   - రాబందు
   - ఉష్ట్రపక్షి
   - నీటికోడి
4. కళాపూర్ణోదయం అనే కావ్యాన్ని రచించిన కవి ఎవరు ?—
   - పింగళిసూరన
   - నాచనసోమనాథుడు
   - శ్రీనాథుడు
5. ప్రపంచంలోకల్లా పెద్దఎడారి ఏది ?
   - గోబీ
   - సహారా
   - థార్
6. ఆవిరియంత్రం కనిపెట్టింది ఎవరు ?—
   - ఎడిసన్
   - డేవీ
   - వాట్

[58-వ పేజి చూడు]

## వినోదం

పిల్లవాడు ఒంటరిగా ఆడుకొంటూవుండటం చూచిన ఒక పెద్దమనిషి "నీ స్నేహితుడేడీ అబ్బాయీ ?—" అని అడిగాడు.

'అతడు వెళ్ళిపోయాడు' అన్నాడు పిల్లవాడు.

'మరి నీకు ఒంటరితనంగా లేదా ?' అని మళ్ళా అడిగాడు పెద్దమనిషి.

'ఒంటరితనంగానే వుంది. కానీ....' అనేలోగా స్నేహితుడు తనను చాలాసార్లు కొట్టిన సంగతి పిల్లవానికి జ్ఞాపకంవచ్చింది...'ఇది కూడా బాగానే వుంది' అని తన జవాబు పూర్తిచేశాడు.

—+—

ఒకసారి ఒక పిల్లవాడు తప్పిపోయాడు. పోలీసువారికి కబురుచేయగా, దగ్గరనేవున్న అడవి అంతా కలయవెదికారు. వెదికేటప్పుడు వారివెంట ఒక కుర్రవాడుకూడా ఉన్నాడు. కూడాఉన్నవాడే తప్పిపోయిన కుర్రవాడని సాయంత్రానికి తెలియవచ్చింది!

—+—

ఒక ఉపన్యాసకుడు ఎడతెగకుండా ఉపన్యసించిన తరవాత 'మీకు సంశయాలుంటే ప్రశ్నలేవైనా అడగవచ్చు' అని శ్రోతలకు చెప్పాడు. వెంటనే ఒక శ్రోత లేచి 'టయిమెంత ?' అని అడిగాడు.

—+—

సుందరం అనే కుర్రవాడు స్కూలుకు ఫోను చేసి "సుందరానికి జబ్బుగా వుంది. ఇవాళ స్కూలుకి రాడు" అని చెప్పాడు.

"సరే. మాట్లాడుతున్న దెవరండీ ?" అని మాస్టరుగారు అడిగారు.

"మా తండ్రిగారు మాట్లాడుతున్నారండి" అని తడుముకోకుండా చెప్పాడు సుందరం.




అనుచరులతోకూడ అప్పుడే తిరిగివస్తున్నాడు, విందుకోసమని పొరుగు సంస్థానానికి వెళ్లిన శాంతసింహుడు. అతను వచ్చేసరికి 'రత్నదుర్గం' నిశ్శబ్దంగా వుంది. అది మామూలు నిశ్శబ్దంకాదు. అందులో ఏదో వింత వుంది. ఆశ్చర్యంతోపాటు భయంకూడా కలిగింది, శాంతసింహునికి. గభీమని గుర్రం దిగి, వెళ్ళి చూచాడు. సింహద్వారం ముక్కచెక్కలై వుంది! లోనికి వెళ్ళితే, ఎక్కడ చూచినా మృతకళేబరాలే! నెత్తురు మడుగులో చచ్చి పడివున్నారు స్త్రీలూ, శిశువులూకూడా! ఘోరం!—

సరాసరి అంతఃపురంలోకి పోయిచూస్తే—అన్నగారి బిడ్డ చచ్చిపడివున్నది! పక్కనే, బాకుతో పొడుచుకు చచ్చిన అతని వదినగారూ కనబడింది! ఆమె ఆభరణాలన్నీ ఎవరో బలిమిని లాక్కొన్నట్టు స్పష్టంగా తెలుస్తున్నది. చూచి నిశ్చేష్టుడయ్యాడు, శాంతసింహుడు.

అంతలో మూలనుంచి, యెవరో మూలిగారు. దగ్గరికి వెళ్ళిచూస్తే అతడు తమ కుటుంబపురోహితుడు. కొనవూపిరితో ఉన్నాడు. అతడన్నాడు—'బాబూ! క్రూరసింహుడు కోటపై దండెత్తాడు. మనవాళ్లు అజాగ్రతగా ఉన్నారు. పైగా యెవరో ద్రోహులు శత్రువులకు మన గుట్టుమట్టులన్నీ చెప్పేశారు. అందుచేత, మీ అన్న సులువుగా ఓడిపోయాడు. ఇక శత్రువుల దురంతాలకు హద్దు లేకపోయింది.

'స్త్రీలనూ శిశువులనూకూడా చిత్రవధ చేసి కోటంతా దోచుకున్నారు. మూల మూలలా వెతికి గాలించారు. ఏమైనా, ఇదిగో—దేనికోసమైతే వారు దాడిచేశారో, ఆ కెంపును మాత్రం కనిపెట్టలేకపోయారు. 'బ్రహ్మహత్యకు' పాల్పడరుగదా ఎంతటి

జి. సుబ్బులక్ష్మి

దుర్మార్గులైనా! కనుక నేనైనా బతికివుంటా ననే ఆశతో మీ వదిన చచ్చిపోతూ, దీనిని నాకు ఇచ్చిపోయింది..." అని అంటూవుండ గానే పురోహితుని కన్నులు ఒక్కసారి మెర సినై. అతడు యజమానిసొత్తు యజమానికి వప్పచెప్పి నిశ్చింతగా మరణించాడు.




శాంతసింహుడు అపరూపమైన అటు వంటి కెంపును మొలలో దోపుకొని, బయటికి వచ్చేశాడు. లోకమంతా ఒక్కసారి చీకటిగా కనిపించింది. 'నా' అనేవారు లేకుండా పోయారు. క్రూరసింహుడు అతడెరుగని వాడుకాడు; అతడు పొరుగునేవున్న సింహ దుర్గ సంస్థానానికి అధిపతి. బహు క్రూరుడు. రత్నదుర్గపు రాజులతో అతనికి వంశపారం పర్యా వైరం ఉన్నది. పైగా రత్నదుర్గ రాజ వంశానికి చెందిన ఆ అమూల్యమైన కెంపు మీద అతడు ఎన్నాళ్లనుంచో కన్నువేసి వుంచాడు. 'ఇంకేం? అదునుచూచి దెబ్బ తీశా' డనుకొన్నాడు శాంతసింహుడు. కోటంతా శ్మశానంలాగా వుంది. అసరాకు ఒక్కపురుగు లేదు. శాంతసింహునికి ఒక్కక్షణం కూడా అక్కడ ఉండబుద్ధి పుట్టలేదు. అందు కని గుర్రమెక్కి, అతడు తన అనుచరులతో బాటు ఉత్తరానికి పయనమయ్యాడు.

అయితే ఈ విషయం కనిపెట్టాడొక ద్రోహి. లోగడ క్రూరసింహునికి కోటగుట్టు తెలిపిన వారిలో వీడుకూడా ఒకడు. వెంటనే కొండమీద క్రూరసింహుడు దండు విడిసి వున్నచోటుకి వెళ్ళాడు. వెళ్ళి 'రత్నదుర్గపు కెంపు యెక్కడవున్నదో ఆ రహస్యం నాకు తెలుసు. చెబితే, నాకు ఏమిస్తా?' రన్నాడు. 'వేయి మొహిరీల'న్నాడు క్రూరసింహుడు. బేరాలు జరిగినై. నించున్నపాటున రెండు వందల మొహిరీలు ఇవ్వటానికి, రహస్యం వెల్లడించిన తర్వాత, మిగిలినమొత్తం ఇవ్వ టానికీ ఒప్పందం జరిగింది.




కాకులకూ, గద్దలకూ వదిలి, అతడు శాంతసింహుని వెంబడించాడు.

కొంతసేపైన తరువాత శాంతసింహునికి తన నెవరో వెంబడిస్తున్నట్టు తెలిసివచ్చింది. అనుచరులను హెచ్చరించి, గుర్రాలను వాయువేగంతో పోనివ్వండన్నాడు. కాని లాభం లేకపోయింది. శత్రువులు వెంటాడుతూనే వున్నారు. క్రూరసింహుడు సమీపించాడు. చావో రేవో తేల్చుకునే సమయం వచ్చేసింది.

అనుచరులను దారి చూచుకోమని చెప్పి ఒక్కడే ముందుకు సాగాడు శాంతసింహుడు. తనవద్ద నున్న కెంపుకోసమే దొంగలు వెంటాడుతున్న సంగతి అతనికి బాగా తెలుసు. ఇప్పుడు అతడు ఒంటిగాడు. అతను ఎక్కివున్న అరబీగుర్రం మెరుపు మెరసినట్టు దౌడుతీస్తున్నది. దాని వేగమే అతనికీ, శత్రువులకు మధ్యనుండే దూరాన్ని ఎక్కువచేసి, అతనిప్రాణం రక్షిస్తున్నది. కాని శత్రువులు వెనుకనుంచి వస్తూనే వున్నారు. వదలలేదు.

సూర్యుడు అస్తమించాడు. శాంతసింహుడు యెక్కిన అరబీగుర్రానికీ, క్రూరసింహుడు యెక్కివస్తున్న నల్ల గుర్రానికీ తీవ

వెంటనే మొలలోనించి మొహిరీలు తీసి, వానికి ఇచ్చాడు క్రూరసింహుడు. అప్పుడా ద్రోహి అమూల్యమైన ఆ కెంపు శాంతసింహుని చేతికి ఎలా వచ్చిందో చెప్పి, అతడు వెళ్ళిన దిక్కుకూడా చూపించాడు.

అప్పుడు క్రూరసింహుడు 'నువ్వు నాకు రహస్యం చెప్పినందుకు వాగ్దానం ప్రకారం వేయి మొహిరీలూ చెల్లించాను. నీవు నీయజమానికి చేసిన ద్రోహానికికూడా బహుమతి పొందవలసివుంది. ఇదిగో ఆ బహుమతి' అంటూ, చేతనున్న ఈటెతో అతనిని చంపివేశాడు. ఆ ద్రోహి కళేబరం

మయిన పోటీ ప్రారంభమయ్యింది. శాంత సింహుడు వెనక్కు తిరిగిచూచాడు.

శత్రువులలో ఒక్కడే-క్రూరసింహుడు మాత్రమే తనకు దగ్గరైనట్టు తెలుసుకున్నాడు. గుర్రాన్ని నిలబెట్టాడు. బాణం యెక్కుపెట్టి, గురిచూచి శత్రువును కొట్టాడు. కాని, వాడు చటుక్కున తల వంచాడు. బాణం గురితప్పి, గుర్రానికి తగిలింది. అది కింద పడిపోయింది. రౌతుకూడా చచ్చినవాడిలా నటిస్తూ పడుకున్నాడు.




శాంతసింహుడు దగ్గరకు వెళ్ళేటప్పటికి ఉన్నట్టేవుండి క్రూరసింహుడు అతని మొల పట్టుకున్నాడు. కథ అడ్డంతిరిగింది. పిల్లినోట కరిచిన ఎలుకలాగా ఐపోయింది శాంతసింహుని పని. గిలగిల లాడాడు. అయినా ధైర్యం వదలలేదు. బాకు తీసి తెగించి పోరాడసాగాడు.

క్రూరసింహుడు కత్తిదూశాడు. శాంత సింహుడూ కత్తితీశాడు. ఈ సంఘర్షణలో అతని గుండెలమీద గట్టి దెబ్బ తగిలింది. నెత్తురు ధారగా ప్రవహించింది. రెండవ దెబ్బకు శత్రువు తయారయ్యేలోపలే, తిరగబడి ఖడ్గం తీసుకొని ఒక్కవేటు వేశాడు శాంతసింహుడు. దెబ్బతో 'అమ్మా!'—అనుకుంటూ తలా, మొండెమూ వేరై, క్రూరసింహుడు చాపకట్టుగా పడ్డాడు!

ఇలా, అపరిమితమైన శరీరశ్రమకు లోనైనాడు శాంతసింహుడు. అయినా, విశ్రాంతి తీసుకోకుండానే ముందుకు సాగాడు. లేకపోతే క్రూరసింహుని అనుచరులవలన ప్రమాదం సంభవిస్తుందని అతనికి తెలుసు.

భళ్ళున తెల్లవారుతూవుండగా, కాశ్మీర్ కనుమలు చేరుకొన్నాడు. పక్కలనున్న ఫలవృక్షాలనూ, వృక్షాలపై గానంచేసే రక

రకాల పక్షిజాలులనూ, పక్కనే ప్రవహించే సెలయేటి నీళ్లనూ చూచి, అతని మనస్సుకు చల్లదనం చేకూరింది. బడలిక తీరింది. ఆ శిలామయ ప్రదేశం దాటి శాంతసింహుడు అందాలుచిందే ఒకానొక ఆరామం చేరుకొని, అక్కడ ఒక చలువరాతి తిన్నె మీద గాఢనిద్రలో మునిగిపోయాడు.

అది, ఆ ప్రదేశానికి అధిపతిఐన ధ్యానసింహుని ఏకైకపుత్రిక, సుమిత్ర విహరించే ఉద్యానవనం! ఆమె చెలికత్తెలతో విహారానికి వచ్చింది. ఆ ఏకాంతప్రదేశంలో ఆమె ఎంతో స్వేచ్ఛగా మసులుకోసాగింది.

అంతలోనే నిద్రపోతున్న శాంతసింహుడు కనిపించాడు. గిరుక్కున మరలిపోబోయింది సుమిత్ర. కాని అతని సుందరాకారం చూచి పోవటానికి మనసొప్పిందికాదు.

ఈసందట్లో శాంతసింహునికి మెలకువ వచ్చేసింది. రాకుమారిని చూచాడు. డిగ్గున లేచినిలబడి సమస్కరించాడు. రాకుమారి సుమిత్ర, నునుసిగ్గుతో అక్కడినుంచి మరలిపోయింది.

మరలిపోవటంలో ఆమె శాంతసింహుని హృదయాన్నికూడా తీసుకపోయింది. కాని రాజపుత్రిని చేపట్టటమనేది తనకు తలకు మించిన పనికదా! సంశయంలో పడ్డాడు. ఐతే—కెంపు తనవద్దనున్న సంగతి మెరపులా స్ఫురించింది. వెంటనే కెంపు తీసికొని ఆ రాకుమారి తండ్రి వద్దకు వెళ్ళి, తాను ఫలానా అని తెలియచెప్పాడు. ఆ కెంపు లోకప్రసిద్ధమైంది కావటంవల్ల ఆమె తండ్రి అతనిని వెంటనే గురుతుపట్టి ఆదరించాడు.

సుమిత్రకూ శాంతసింహునికీ అతి వైభవంగా వివాహంజరిగింది. అనాడు తన అన్నగారి కుటుంబాన్ని కూల్చిన ఆ కలిసిరాని కెంపు, ఈనాడు శాంతసింహుణ్ణి ఒక ఇంటివానిగా చేసినటువంటి అమూల్యాభరణమయింది!



# ‘తొమ్మిది’ మహత్వం

అంకెలలోకల్లా తొమ్మిది అంకె చాలా చిత్రమయింది. ఈ 9 అంకెతో అనేకమైన చిత్రాలు చేయవచ్చు. ఎలా అంటే—ముందు తొమ్మిదవ ఎక్కంలో వుండే గమ్మత్తులు చూదాం;

తొమ్మిది ఒకట్ల తొమ్మిది

9 × 2 = 18
9 × 3 = 27
9 × 4 = 36
9 × 5 = 45

తొమ్మిదిఆర్లు ఎంత? అనే ప్రశ్నకు మనం తడుముకోకుండానే గభీమని జవాబు చెప్పేసుకోవచ్చు. 9 × 5 = 45 కదా? ఆ 45 ని తిరగేసిచూస్తేసరి. అలాగే వరసగా తక్కినవిన్నీ. చూడండి:

9 × 6 = 54
9 × 7 = 63
9 × 8 = 72
9 × 9 = 81

ఇంకొక విశేషం ఏమిటంటే—9వ ఎక్కం గుణించగా వచ్చే మొత్తాలు ఏవైనాసరే కూడితే, మళ్ళీ 9 అంకే తయారవుతుంది. మచ్చుకి—

9 × 2 = 18 .... 1 + 8 = 9
9 × 3 = 27 .... 2 + 7 = 9
9 × 4 = 36 .... 3 + 6 = 9
9 × 5 = 45 .... 4 + 5 = 9

ఇదేమోస్తరుగా తక్కినవిన్నీ.

కూడికలో 9 ని గురించిన మరిఒక తమాషా వుంది. 9 అంకెకు మరిఒక అంకె కలుపు. ఆ వచ్చిన మొత్తాన్ని మళ్లీ కలుపు. మొదట నీవు ఏ అంకె కలిపావో అదే ఇప్పుడు వస్తుంది. 9 అంకె కదలకుండా దాని స్థానంలో అది అలానే వుండిపోతుంది. ఉదాహరణ:

9 + 2 = 11 .... 1 + 1 = 2
9 + 3 = 12 .... 1 + 2 = 3
9 + 4 = 13 .... 1 + 3 = 4
9 + 5 = 14 .... 1 + 4 = 5
9 + 6 = 15 .... 1 + 5 = 6
9 + 7 = 16 .... 1 + 6 = 7
9 + 8 = 17 .... 1 + 7 = 8
9 + 9 = 18 .... 1 + 8 = 9

ఇవిగాక, మీకు తెలిసిన చిత్రాలుకొన్ని వ్రాసి పంపించండి.

# అట్టచివరి బొమ్మ

తనకు పిల్లి ఆదరించియిచ్చిన కుక్కబొమ్మను కృపాసేనుడు అందరకూ చూపాడు. అది చిత్రంగా మెరుగుతున్నది. మొగ్గలువేస్తున్నది. రాజాధిరాజులందరూ దాని వింతచేష్టలు చూచి, తెగ నవ్వారు! దానినిచూచిన అందరూ తండ్రి రాజ్యం ఈ పిన్నవాడికి వచ్చేతీరుతుందన్నారు.

ఈ కుక్కబొమ్మను చూడగానే తండ్రి అపరిమితానందాన్ని పొందాడు. పట్టలేని ఆ సంతోషంతో రాజుకు ఎప్పటి జీవం వచ్చేసి, అతనొక యవ్వనవంతుడైనాడు! యవ్వనవంతుడు కాగానే, రాజుకు మళ్ళీ రాజ్యం తనే ఏలుదామని కాంక్ష పట్టుకుంది. కనుక, కొడుకులను తప్పించటానికి ఇప్పుడు మరిఒక పరీక్ష పెట్టాడు—'నాలుగువందల గజాల పొడువుగలది, సూదిబెజ్జంలోనించి దూరేటటువంటిది, సన్నటివస్త్రం ఎవరు తెస్తే, వాళ్లకి రాజ్యం ఇస్తా' నన్నాడు.

రాజకుమారులు ముగ్గురూ మునుపటిలాగే బయలుదేరారు. ఈసారి కృపాసేనుడు మళ్ళీ తెల్లపిల్లి భవనానికి వెళ్ళాడు. పిల్లి ప్రేమతో అతన్ని ఆదరించి, ఈ అపరూపమైన కోరికకూడా తీర్చింది. ఇదిచూడగానే రాజుకు ఆనందం మరీ ఎక్కువై, కొడుకులకు రాజ్యం ఇవ్వటానికి ఇష్టపడనేలేదు. ఇప్పుడు రాజు మరొక పరీక్ష పెట్టాడు—'ప్రపంచంలోకెల్లా పరమసుందరమైన కన్యను ఎవరు తెస్తే వాళ్ళకే నారాజ్యం' అని ప్రకటించాడు.

మూడవసారికూడా కృపాసేనుడు పిల్లివద్దకు వెళ్ళి, తండ్రి కోరిక వినికిడి చేయగా, 'దీనికేముంది, నువ్వొక పనిచెయ్యి. నా తల తెగవెయ్యి. తలతోపాటు నా గోళ్లు వొలిచి నిప్పులో వెయ్యి. నీ కార్యం సఫలమవుతుంది' అన్నది.

బిత్తరపోయాడు కృపాసేనుడు. కాని పిల్లి బలవంతపెట్టి బతిమాలింది. ఎంతగా కాలయాపన చేసినప్పటికీ, కృపాసేనుడికి ఈపని తప్పలేదు. చివరకు ఒకనాడు 'అయ్యో! ఎంత దుర్మార్గుణ్ణి!!' అని విలపిస్తూ, అతను తల అవతలకు తిప్పి, కన్నులు మూసుకొని ప్రేమాస్పదమైన తన పిల్లి తలను తెగవేశాడు. దాని గోళ్ళుకూడా తీసి వెంటనే నిప్పులో పడవేశాడు. ఈపని జరిగిన క్షణమందే ఆ పిల్లి మాయమై, అపరూపసుందరమైన ఒక చిన్నది ఎదట ప్రత్యక్షమైంది!!

## నా సంగతి

గ్రహాలన్నిటికీ రాజు సూర్యుడే,
ధృవనక్షత్రం తారల రాజు
మనదేశం దేశాలకు రాజు
కలకత్తా నగరాలకు రాజు.

పువ్వులన్నిటికి రాజు గులాబీ
పటతపువే వృక్షాలకు రాజు.
రాజు వనాలకు నందనవనమే
మామిడిపండే పండ్లకు రాజు.

కీటకాల రాజేమో తుమ్మెద
నల్లతాచు ఉరగాలకు రాజు.
వన్యమృగాలకు రాజు సింహమే.
శ్వేతహంస విహగాలకు రాజు.

నేనే రాజుని ఇంట్లోవాళ్ళకు.
తాతను తాతమ్మను వణికిస్తా
ఏడ్చి, అలిగి, రాగంతీసి
కొండమీది కోతిని తెప్పిస్తా.

[చంద్రం]

చైనాబాలురకు ప్రధాని శ్రీ జవహర్‌లాల్ నెహ్రూ కానుక, 15 ఏండ్ల గున్నఏనుగ 'ఆశ', పెకింగ్‌కు పంపేముందు కలకత్తా 'జూ'లో ఉన్నప్పుడు బాలబాలికలు చూచి ఆనందిస్తున్నారు.



## మార్చినెల 'చెప్పకోగలవా ?' జవాబులు

1. గడియారం 12 కొట్టటానికి 66 సెకన్లు పట్టుతుంది. మొదటిదెబ్బకూ 6-వ దెబ్బకూ మధ్య 6-6 సెకన్ల 5 వ్యవధులు ఉంటాయి. మొదటి దెబ్బకూ 12-వ దెబ్బకూ మధ్య 6-6 సెకన్ల 11 వ్యవధు లుంటాయి. అందుకే గడియారం 12 కొట్టటానికి 66 సెకన్లు పట్టుతుంది.

2. ఇంటావిడ కొడుకు 3 గిద్దలపాత్రనిండా రెండుసార్లు పాలు నింపి, ఆ పాలను 5 గిద్దల పాత్రలో పోయగా. 5 గిద్దలపాత్ర నిండిపోయి, 3 గిద్దల పాత్రలో ఒక గిద్దపాలు మిగిలినై. ఇప్పుడు అతడు 5 గిద్దల పాత్రలో పాలను పాలవాని పాత్రలో పోసి, 3 గిద్దల పాత్రలో మిగిలివున్న ఒకగిద్ద పాలనూ 5 గిద్దలపాత్రలో పోశాడు. ఇక—3 గిద్దల పాత్రను పాలవాని గిన్నెలోనించి మళ్ళీ నింపి, ఒక గిద్దపాలు పోసి వున్న 5 గిద్దల పాత్రలో పోయగా, సరిగా 4-4 గిద్దల చొప్పన రెండుభాగాలయినై.

3. 12 గురిలో చివరిపిల్లవాడు పండుతోసహా బుట్టకూడా తీసుకొన్నాడు.

4. వామిచుట్టూ తిరగటానికి దొంగకు 40 సెకన్లు, దొరకు 30 సెకన్లు పట్టుతుంది గనుక, దొంగ మూడుసార్లు చుట్టూ తిరిగివచ్చే వ్యవధిలో దొర 4 సార్లు తిరిగివస్తాడు. దొంగ 1/2 చుట్టు ముందు వుండగానే ఇద్దరూ తిరగటం మొదలెట్టారు కాబట్టి, రెండుచుట్లు తిరిగేటప్పటికి దొర దొంగను పట్టివేయగలడు.

---

### 'బదులుచెప్పు' జవాబులు :

1. రష్యా, 2. హేస్టింగ్స్, 3. ఉష్ట్రపక్షి, 4. పింగళి సూరన, 5. సహారా, 6. వాట్.

---

## ఫోటో వ్యాఖ్యల పోటీ

### మేనెల ఫలితాలు

★

మేనెల చందమామలో ప్రచురింపబడే ఫొటోలకుగాను, మాకు వచ్చిన వ్యాఖ్యలలో ఉత్తమంగా వున్న ఈ దిగువ వ్యాఖ్యలకు బహుమతి యివ్వడమైనది.

వ్యాఖ్యలు :

మొదటి ఫొటో : విద్యుత్ గానం

రెండవ ఫొటో : విద్యుత్ గానం

పంపినవారు :

సి. ఏ. శ్రీనాథ్, 5, S. K. P. కోయిల్ వీధి,

వెల్లూరు (నార్త్ ఆర్కాట్ జిల్లా)

బహుమతిపొందిన ఈ వ్యాఖ్యలు, పంపిన వారి పేరుతోసహా మేనెల చందమామ ఫొటోల దిగువని ప్రచురిస్తాము. బహుమతి మొత్తం రూ. 10/- మే న చిః వెలువడిన వెంటనే పంపబడుతుంది.

★

## జూన్ నెలలో

ప్రచురింపబడే ఫొటోల నమూనాలు వివరాలతోసహా ప్రక్క పేజీలో చూడండి.

---

### ముఖ్యసూచన :

వ్యాఖ్యలను ప్రక్క పేజీలోని కూపన్‌లోనే పూర్తిచేసి పంపాలి. పూర్తిచేసిన కూపను బుక్‌పోస్టులో పంపవచ్చు. ఇందుతో ఏటు వంటి జాబులను జతపరచకూడదు.

## 1953 జూన్ సంచికలో ప్రకటింపబడే ఫోటోలకు నమూనాలు





★ పై రెండు ఫోటోలకూ సరిఐన వ్యాఖ్యలు కావాలి. వ్యాఖ్య ముచ్చటైన ఒక్క మాటలో గానీ, చిన్నివాక్యంలో గానీ ఉండవచ్చు. మొదటిఫోటోకూ రెండవ ఫోటోకూ వ్యాఖ్యలు సంబంధం కలిగివుండాలి.

★ ఏప్రిల్ 10-వ తేదీలోగా వ్యాఖ్యలు మాకు చేరాలి. తరువాత చేరే వ్యాఖ్యలు ఎంత మాత్రమూ పరిశీలింపబడవు.

★ మాకు చేరిన వ్యాఖ్యలలో అత్యుత్తమంగా వున్న సెట్టుకు (రెండు వ్యాఖ్యలకు కలిపి) రు. 10/-లు బహుమానం.

★ దిగువ కూపన్‌లో వ్యాఖ్యలు రెండూ పూర్తి చేసి, ఈ అడ్రసుకు పంపాలి :-చందమామ ఫోటోవ్యాఖ్యల పోటీ, మద్రాసు - 26.

★ చందమామ కూపన్లలోగాక, ఇతర విధముల పంపే వ్యాఖ్యలు పోటీకి పనికిరావు.

→ చందమామ ఫోటోవ్యాఖ్యల పోటీ కూపన్ ←

మొదటి ఫోటో — రెండవ ఫోటో

వ్యాఖ్య .................................... వ్యాఖ్య ....................................

పంపినవారి పేరు ....................................

పూర్తి చిరునామా....................................



వస్తూంది!

విజయ వారి

# చంద్రహారం

డైరెక్టర్
కె. కామేశ్వరరావు
బి.ఏ.





నిర్మాతలు... నాగిరెడ్డి & చక్రపాణి

Printed by B. NAGI REDDI at the B. N. K. Press Ltd., Madras 26, and Published by him from Chandamama Publications, Madras 26, Controlling Editor: SRI CHAKRAPANI.

Photo by Branlal K. Patel



బహుమతి
పొందిన వ్యాఖ్య

గొల్లవాని మూలధనము

పంపినవారు :
జె. సత్యనారాయణప్రసాద్

